శ్రీమత్పరదేవతాయై నమః.

# గీరతము.

## గురుదక్షిణ.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడి

మల్లంపల్లి భైరవమూర్తిగారిచే

స్వకీయమగు

శ్రీ భైరవముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడెను.

మొదటికూర్పు 1,000 కాపీలు.

మచిలీబందరు.

దీని వెల రు 0—10—0.

1913.

# ఉపోద్ఘాతము.

చదువరులారా!

గీరతప్రథమభాగము చదివి యుంటిరి కదా? సర్వవిషయములును సూత్రప్రాయముగా నందే గతార్థము లగుటచే నిప్పుడు ప్రకటించు ద్వితీయభాగమునఁ గాని ప్రకటింపఁ బోవు తృతీయభాగమునఁ గాని తెలియఁదగు విశేషాంశము లంతగా నుండవు. ఎన్నాళ్లు చదివినను నాయాయీ గ్రంథభాగములయందు—

(1) శిష్యుఁడు గురుద్రోహము చేయుటతప్పు (2) అందులో నీ శిష్యుఁడు వత్సరములకొలఁది చదివిన శిష్యుఁడు గాని వేఱొకవిధమగువాఁడు కాఁడు (3) పైఁగా నితఁడు కృతఘ్నుఁడగుటతోఁ జాలింపక పదరుఁబోతువ్రాఁతలు, అసత్యములు, అపవాదలు లోనగునవి ప్రకటించుట మొట్టమొదలే తప్పు

అనునీయంశములు దక్క వక్తవ్యాంశము గానరాదు. గురువే ద్రోహియో లేక శిష్యుఁడే ద్రోహియో మీకు మొదటిభాగమువలననే గతార్థమై యుంటచే దీనిప్రకటన మంతయావశ్యక మని మాకును దోఁచలేదు గాని మొదటిభాగమునందు విస్తరభీతిచే వదలినయంశములు కొండొక యుంటచే నయ్యవి యిందు ఖండించు మిషమీఁద గురుశిష్యధర్మములు కొన్ని సంగ్రహించి చూపుటకై దీనిని ముద్రించితిమి. "అట్టహాసము" అనునది ప్రథమభాగమందే యించుక స్పృశించి వదలఁ బడినది పిమ్మట గుంటూరిసీమ పూర్వరంగము 47, 48, 49 వ పుటలలోఁ గొండొక దాని బండారము బయట బెట్టఁ బడినది. ఇందుంగూడ నక్కడక్కడ దానిం గూర్చి ప్రస్తావింపఁ బడినది. "అట్టహాసమే యన నేల మాశిష్యులు వ్రాసెడి వ్రాఁతలెల్లఁ బరికించి చూచినచో.—

(1) మాగురువు పండితుఁడు గాఁడు. (2) పాత్రుఁడు గాఁడు.

అను నంశము సాధించుటకై పాటుపడుటదక్క వేఱొక్కటి గానరాదు. ఇందులకు వారు చూపుప్రమాణములో? పేరు దాఁచికొని తోఁచినవ్రల్లదములెల్ల వ్యయపఱచిన తస్కరుల వ్రాఁతలు, ఆవ్రాఁతలవలననే గీరత ప్రథమభాగము నిస్సార మనియు నిరుపయోగ మనియు గూడ లిఖించి సంతసించుచుండిరి ఆ వ్రాఁతలతత్త్వము లోకమెల్ల నెఱుంగును మాశిష్యు లంతకుమున్నే యెఱుఁగుదురు, ఎటఁ

గియును వానివలన మాకేదియో న్యూనత కలుగు ననియు నంతలోఁ దమగురుత్వముకూడఁ బోవు ననియుంగాఁబోలును వీ రవి పట్టుకొని సారెకు వ్రేలాడుట,

“శ్లో॥ కతిపయదివసైః క్షయంప్రయాయా, త్కనకగిరిః కృతవాసరావసానః, ఇతిముద ముపయాతి చక్రవాకీ వితరణశాలిని వీరరుద్రదేవే. (విద్యానాథకృతము)

“తుష్యతుదుర్జన” న్యాయమున నాయాయీతప్పుడు వ్రాఁతలెల్ల నిజములేనైనను దమ కవి సాయము గావు, అవి మాకుఁ గలయశమును బోఁగొట్టినఁ బోఁగొట్టుఁగాక తమగురుత్వము నెట్లు పోఁగొట్ట గలవు? కావున వీరు మమ్ము దోషులనుగాఁ జేయుటకు వ్రాయు వ్రాఁతలేమి యందులకై వ్యయపఱచుచున్న ద్రవ్యప్రదాతల సొమ్మేమి వమ్మే గాని లాభకారిగావని వారి కిప్పటికేనిఁ దెలిసినచోఁ గొంతయుక్తముగానుండును నానాఁటికి వీరు మఱియును నట్టడవిని బడుచున్నట్లు వ్రాఁతలవలనఁ దెలియ వచ్చుచున్నది మొదట గురుని కపాత్రత్వను సాధించుటకు “గాకి” యని పదరఁ దొరఁకొనిరి,

“పక్షిణాం కాకీ చండాలీ”

అనుటవలన నది యపాత్రత్వమునకు సాధకమే, ఇటీవలనో? ఈవేంకటేశ్వరుఁడే యీ వేంకటేశ్వరుఁ డని యభేదాధ్యవసాయము చేసికొని పడఁదిట్ట నారంభించిరి, అతివిస్తరమెందులకు. ఏదో విధమునఁ దిట్టుట వీరిముఖ్యోద్దేశము, ఏదోవిధమున నీతి గఱపుట మాముఖ్యోద్దేశము, వా రందులకును మే మిందులకును బాటుపడవలసిన దని భగవంతుఁ డేర్పఱచియుండుటచే నేవో వ్రాసికొనుచుందుము. రసారసవిచారముతో మాకుఁ బని లేదు కావునఁ జదువరులు మమ్ము నిందింప కుందురుగాక, ముందు ప్రకటింపఁబోవుభాగములలో ‘తిరుపతి వెంకటేశ్వరార్థశతకమును’ గూర్చినపద్యములుండును. 78 వ పుటలోని 237 వ పద్యము వలన నీ భాగము వెలువడు నప్పటి కది మేము చూడనే లేదని తోఁచును గాని, అపుడు ముద్రిత మగునప్పటికే చూచియుండలేదు గాని యిటీవలఁ జూచితిమని యెఱుంగునది, వెంటనే కొన్నిపండితుల పద్యములతో ఖండింపఁ బడినది గాని విస్తరభీతిచే నవి యిందుఁ జేర్ప లేదు, దేవునితో నభేదముచేసి తిట్టుట వలన వారికిఁ బాపమున్నదో లేదో గాని దానిని ఖండించుటకుఁ జెప్పకవిత్వమువలన మాకొకింత పుణ్యముకూడఁ గలుగుచున్నదని యానందించుచున్నారము. ఇది ముందు రాఁబోవు భాగమునఁ జర్చింపఁ దగిన దగుటచే నిందు విస్త

రింపక ప్రకృత మగు 'కోకిలకాకమును గూర్చియు, నింతకుమున్న ప్రచురిం చిన గీరత ప్రథమభాగముపై వారు ప్రకటించిన శంకలను గూర్చియుఁ గొండొక వ్రాసి విరమించెదము. "కోకిలకాక" మన్యాపదేశముగ దాని దానిని మాపై నేల పెట్టుకొంటిరి. అని ప్రశ్నరావచ్చును, అందులకుఁ బ్రథమభాగపీఠికలో మాశిష్యుల వ్రాఁతలనే బోధకములనుగాఁ జూపి యున్నారము. ఇందుఁగూడఁ గొండొక చూపెదము.

(కవితలోని ప్రభాకరపరామర్శమునుండి)

చ॥ ...... మీగురులకుఁ దెల్లమే,...... మాగురులశక్తి ... ... ఉండిరి బద్ధ
శక్తి ...... దెబ్బఁదిను కాకియె కాక నిగుంగెఱుఁగునే॥

ఈ పద్యము 47 వ పుట మొదలుకొని యుదాహరించిన వేటూరి ప్రభాకర శాస్త్రి సతీర్థ్యసంప్రార్థన పద్యముల కిచ్చిన ప్రత్యుత్తరములోనిది, అతఁడు గురువును గాకి యని వ్రాయుట తప్పని మందలించిన పైని వ్రాసిన వ్రాఁతలో మరల నదే పాటపాడుచు లేదని బొంక మొదలిడిన వీరి తెల్విని, వీరి దైవానుకూల్యమును జదువరులే విచారించుకొందురుగాక. ఈ బొంకులను దమపేరితోఁ బ్రకటింపక శిష్యుని పేరఁ బ్రకటించుటవలనఁ దా మతని మందలింపున కుత్తరమీలేమి స్ఫుటమగుచున్నది, ఏశిష్యుపేర నీ ప్రల్లదములను వీరు ప్రచురించిరో ఆశిష్యుఁడే యిటీవల "పాణిగృహీతా ప్రశస్తానందశృంఖల" యను పేరితో 120 పుటలకుమించిన బూతుఁగూఁతలను వ్రాసి లోకుల స్తోత్రముల కర్హమైన గుణవంతుఁడు. అతని పేరా పాత్రముననే చూడఁదగు, అతని శంకలకుత్తరములు "శృంఖలాత్పృణీకరణము" చదివిన విస్పష్టముగఁ దెలియఁగలవు ఆబూతులవ్రాఁత వెం॥ రా॥ లయొక్క మీఁదనే జరిగినదనుటకు సాక్షిభూతము లగునంశములు బోలెఁడుకలవు అవి గూడ నన్యత్ర చూడవలయును మఱియుఁ బ్రకృతమగు "ప్రభాకరపరామర్శ మునుండియె మఱికొన్ని యసందర్భప్రలాపములను జూపుచున్నారము

"మ॥ ... వ్రాయఁగ నాయంబె సతీర్థ్యులంచు ... కొద్దిగ శ్రీరామకవీం
ద్రుఁ డొకఁడుఁడె విద్దె నేర్చె ...యిర్వురకా బిలిచెదే,

ప్రభాకరశాస్త్రి "సతీర్థ్యులార" అని వెం॥ రా॥ ల నిరువురను బిల్చుట తప్పఁటని తాతప్పిట్లు సమర్థింపఁ బడుఁగాక. ఏండ్లకొలఁది వెంకటరామయ్య శిష్యుఁడు, రెండవయతఁడో కొన్నాళ్లు మాత్రము శిష్యుఁడు దీనింగూర్చి భారవిమున

తిరుపతిశాస్త్రి వెంకటశాస్త్రివద్దఁ జదివిన దేదియును లేదు. అట్లే వెంకటరామయ్యకూడ నని శిష్యని వ్రాలుతోఁ బ్రకటించు మా శిష్యులసాహసమును లోకము పరికించుఁగాక. తిరుపతిశాస్త్రి వెంకటశాస్త్రియందు గురుత్వమును జూపు గారణము, అతనికంటె నితఁడు ముందుగాఁ గవనము రచించు నలవాటు గల్గినవాఁడగుటచే నేకందపద్యలక్షణమునైన యే యొకనిమిత్తముననో యితనివలనఁ దెలిసికొనుటతప్ప వేఱుగాదు, ఇఁక వెంకటరామశాస్త్రికిఁ గల యాశద్గురుత్వములో నెన్ని వంతులలోనైన యొకవంతుమాత్ర మితరులధియుఁ దక్కినదెల్ల వెంకటశాస్త్రిదియు నగుటకు భగవంతుఁడే సాక్షి కాఁగలఁడు. దీనింగూర్చి పూర్వభాగములో విస్తరింపఁదలఁచి యిందు సూత్రమాత్రముగా నిది విరమింపఁబడుచున్నది. అప్రస్తుతప్రశంసలో మూఁడుమాసము లని కృష్ణకవి వ్రాసినను, కోకిలకాకములో 'చాలఁగాలమ్ము విసివి, అని యిరువురచే వ్రాల్తోఁ బ్రకటించి యున్నారు. "చాలఁగాల" మనఁగా? మూఁడుమాసములే యని పోట్లాడుదురా? అయినచో 'స్త్రీప్రత్యయాంతము కౌముది' చదువుట పొసఁగదు, ఎక్కువబుద్ధిమంతులకు మూఁడుమాసములలోనే స్త్రీప్రత్యయాంతము కావచ్చునని వాదమునకు దిగినను నిలుపదు, మూఁడుమాసములు [illegible] చేసెను, మాసము 1కి నన ధ్యాయములు 10 దినములు, అదిగాక మధ్యమధ్య నైమిత్తికములు కొన్ని యుండును. అవియెల్లఁబోఁద్రోసినచో సుమారు 45 దినములు చదివినట్లు తేలును, ఆదినములలోనే స్త్రీప్రత్యయాంతము చదువుటకు వైయాకరణు లెవ్వరును నొప్పరు, పైఁగా నా నలుబదియైదు దినములేని పాఠము జరుగుటకు.—

"తా" నెవ్వఁడుఁ బొట్టకూటికొఱకే తిరుగాడుచునుంట నేమియుం జెప్పఁ
కాక కోయిలకు,, (కోకిలకాకము.)

అను వారివాక్యమే యొప్పి కొనదు కావున విమర్శించుచో మాశిష్యులు వ్రాయువ్రాఁతలెల్ల నింతసారము కలవి, వారియదృష్టము మంచిది, కావున వారికి గురుదూషణ, దేవదూషణ 'అనృతోక్తులు' ఇఁక్క నేమి కావలెను, కలియుగమునకుఁ గావలసిన సామగ్రి యంతయుఁ బట్టించిన ది 'దానితో' బోలెఁడు గ్రంథమును వ్రాయుచున్నారు. వ్రాయఁగలరు, ప్రతిగ్రంథమును నిట్లు విమర్శించి నిగ్గు తేల్చువా రెవరు? ఎవరికిఁ గావలెను, స్థూలదృష్టిచేఁ దిలకించువారో, "కాఁబోలును" అని యనుకొందురు, ఇది యిటులుండె, "పరామర్శము" నుండి యొకటిరెంటి నుదాహరించి దానిసారమును దెల్పి వదలుచున్నారము.

"సీ॥ దయమీఱ నైషధాంతము కావ్యములు చెప్పి సాహిత్యయుతునిగాఁ జల్పినాఁడు"

వెంకటశాస్త్రికి శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారు నైషధాంతము కావ్యములు చెప్పిరనియుఁ గవిత్వము మొదలైనవి నేర్పిరనియు వారియెడల వెంకటశాస్త్రి కృతఘ్నుఁ డయ్యెననియుఁ బై పద్యమునందలి సారము, శ్రీకృష్ణమూర్తిశాస్త్రులవారివద్ద వెంకటశాస్త్రి చేసిన విద్యాభ్యాసాధికము నీక్రింది పద్యములవలనఁ దెలిసికొనఁ గోరెదము.

(జాతకచర్యనుండి)

చ॥ కదలి యనంతరం బచోటు కాటవరంబను నొక్క పల్లెకిం బాదపగ నేగ...,,

కాటవరమనునది శ్రీశాస్త్రులవారి నివాసస్థానము శ్రీవారిటీవలఁ జాలకాలముక్రిందట రాజమంద్రి ప్రవేశించిరి.—

(మఱికొన్ని పద్యములు.)

తే॥ గీ॥ అచట శ్రీపాదవంశజాఁ డనఘమూర్తి, కృష్ణమూర్త్యాఖ్య సుకవి వరేణ్యు నొద్ద, మొదలిడి కుమార సంభవమునను రెండు, సర్గలుపఠించె మూడు మాసముల కెలమి,,... తే॥ గీ॥ గురువుఁ దత్పాఠపాఠియుఁ గూడి తమచు, నాడుచుం దురు చదరంగ మట్టియెడల, లక్షణం బెట్టు లట్టి తల్లక్షణంబు, నితఁడు గ్రహియిం చె నాదరమొనక మొనఁగ.... తే॥ గీ॥ అంత మేఘసందేశకావ్యమును మొదలు, పెట్టి చదువుచు నున్నంత విఘ్నకార, ణం బుదయమందెఁ దత్ప్రరూపంబు దెలియఁ బలిచెద...,, చ॥ -- గురునింటి మృదంగనై నాత్మ దేహమం, దాదవె నొకించుకంత జ్వరరోగము, --- గురునికిఁ బచియించి యానమాఖ్యపురముం జనెఁ దల్లిని దండ్రినింగనన్,,...

నైషధము శ్రీశాస్త్రులవారివద్దనే కాదు మఱియొకరియొద్దఁగూడ నిప్పటికిని వెంకటశాస్త్రి చదువనే లేదు ఇంక ముందు చదువవలసియుండును, అయ్యాయగ్ర శములకు శ్రీశాస్త్రులవారే సాక్షులు, శ్రీశాస్త్రులవారు వెంకటశాస్త్రిని కృతఘ్నుఁ డనియంటిరో యే మందురో 57 వ పుట. 11 వ పంక్తి లోని గాదె జగన్నాథస్వామిగారి పద్యములో జూడఁ గోరెదము, గిరత్రయమభాగమున 37 వ పుటలోని సీసపద్యమునఁగూడ శ్రీశాస్త్రులవారి విషయము కొంత కలదు. చదువఁగో

రెదము, అథవా, శ్రీశాస్త్రులవారికి వెంకటశాస్త్రి కృతజ్ఞుఁడు గాఁడు, అంతమాత్రమునఁ దమకేమి లాభము. అతఁడే రౌరవాదినరకముల కగ్గమై పోవుఁగాక, అతనిద్రోహ నింద్య మని యెంచియు వీరేల పట్టవలెను.

'యాన్యస్మాకగ్ం సుచరితాని' తానిత్వయోపాస్యాని. నో ఇతరాణి.

అని చెప్పిన వేదవాక్య మెఱుఁగనిది, అతనియందుని గ్రహించినచోఁ దమ్మీ లోకము మెచ్చునుగాని యందులకుఁ బరాఙ్ముఖులై యతని చెడ్డను గ్రహించినఫలమేమి, ఇది యిటులుండుఁగాక, ఇఁక వీరిగీరతవిమర్శనవుశైలి నించుక ప్రదర్శింతము.

'గీరత' శబ్దము సాధువుకా దని కొంత చర్చ వ్రాసి దూషించిరి, అది పండితులు చేయవలసినది కాని జ్ఞానలవదుర్విదగ్ధులెల్ల దానికి నధికారులు కారు, వీరు జ్ఞానలవదుర్విదగ్ధు లనుసంశయమునకు వారి "శతఘ్ని"యే మొదటిసాక్షి, ఈవిషయమును దెలిసికొనఁగోరువారు పాశుపతమును జదువఁగోరెదము, పాశుపతమే యక్కఱ లేదు. వీరొకకవితావళిలో నెవరో మేజస్ట్రేటుగారు కాళిదాసకృత మగు "శృంగారతిలకమును" తెలిఁగించి రని వ్రాయుచు వారిపద్దెములను మెచ్చుటకుఁగా మా 'రసికానందమును', దెగఁదిట్టి మొదలిడి కొన్ని పత్రికలు దాని తోడనే నించి కాలక్షేపము చేసిరి, అందెన్నో యసంగతప్రలాపములను వావిడిచిరి, దిఙ్మాత్ర ముదాహరించుచున్నారము.

ఉ॥ రాతిరి మబ్బుచేతఁ దిమిరమ్మధికమ్ముగ నుండె, వ్యాప్తిమై। నాతత
కష్టుఁడై పతిరయమ్మున నిద్దురవోయె దొంగ లీ। రాతిరి యూరుచొచ్చిరి కరమ్ము
ను బాలనుగాన నెంతయుఁ। భీతిలుచున్నదాన నిఁక వేగమె నిద్దురమాను
పాంథుఁడా?. (రసికానందము)

శైవద్యమును విమర్శించుచు నందు "రాతిరి" అనుపదము రెండుసార్లు వాడుట తప్పని వెక్కిరింపఁ జొచ్చిరి

(వసంతతిలకము).

ఈబాలు నెత్తికొని యింటికిఁ జన్న నన్నుఁ, నాబంధులందఱు మనంబున
నేమనారె, ఈబాలు సూర్యనిభు నిట్టులపెట్టిపోవఁ, గాబుద్ధి పుట్ట దని కన్య మనం
బులోనన్ — భారత - ఆది - ౫-౮

దీనింబట్టి యట్లు వాడుట భారతసమ్మతమని స్ఫుట మగుచున్నది. కొంత స్వల్పవిషయమును గనిపెట్టని వీరు పెద్దపెద్ద విషయములలోనికి దిగుట 'కొట్టి

కెదురులేనియమ్మ స్వర్గమున కెదురుటవంటిది. గాన వీరివిద్యావిషయక మగుశంకల కిట నుత్తరము లిచ్చుటకుఁ బ్రారంభించి కొన్నిపుటలు వ్యయమ్మొనర్పఁ దొరఁకొనము. అదిగాక గీరతములవలనఁ దమనెత్తినిబడు నంశములేవియా వానిని ఖణ్డించుకొనుటకన్న శబ్దవిచారమేమి ముఖ్యము, కృతఘ్నత్వమును గాని యసత్యతత్పరత్వమును గాని లేకుండఁ గాపాడుకొనఁ బ్రయత్నించవలయునే కాని యాశబ్దము బాగులేదు, అంతలియుత్తరములు వ్రాసినవారు 'తి॥ వెం॥ కవులకు బందుగులు' మఱియుం గొందఱు స్నేహితులు లోనగు నపలాపములవలన ఫలమేమి, ఒకరిద్దఱు మూగురు లేక నలుగురైదుగురు వెం॥ శాస్త్రికి బందుగులే యగుదురు గాక వారువ్రాసినవ్రాఁతలో నున్నవిశేషమేమి? వెంకటశాస్త్రికిఁ బిచ్చియెత్తినదని యెవరేని ప్రచురము చేసినప్పుడు దానింగూర్చి క్షేమసమాచారము తెలిసికొనుటకు వ్రాయువారు బందుగులు కాఁగూడదా? అంతమాత్రమున నందలియుత్తరములెల్ల బందుగులవియు స్నేహితులవియు నని బొంకినఁ బోవునా? మఱికొన్ని.

“తమంతఁ దామె కల్పించినవి”

యని కూడ వ్రాయ మొదలిడిరి ఈమాట కర్థమేమైనఁ గలదా? అట్లుకల్పించినచో నయ్యెవార లూరకుండుదురా?, ఈత్రోవ కొప్పరపుఁద్రోవ, దీనింగూర్చి గుంటూరిసీమ, ఉత్తరరంగపీఠిక చూడఁదగు ఇట్టివే యనేకములు ప్రల్లదములందుఁ గలవు, ద్విభాష్యం పుల్లకవిగారు వీరియందభిమానముకలవారా? కారా? ఆయన వ్రాసినయుత్తరము నీగురుదక్షిణలోఁ బ్రచురించితిమి. 52 వ పుటలోఁ జూడఁదగు. ఆయనకు వీరియందుఁ గలయభిమానమును స్ఫుటీకరించుచున్నారము

(కవితాపత్రికనుండి.)

క॥ శ్రీవేదమూర్తులై తగు, శ్రీవేదుల రామకృష్ణశేఖరునకుఁ, దద్భ్రాతృఁడుఁ డోలేట్యన్వయుఁ, డౌ వెంకట రామకవి సదంఘ్రిద్వయికిన్॥ ౧॥...మ॥ ఒకచో ముద్దులు మూటఁ గట్టు నొకచో నుయ్యారముల్ చూపు నిం, కొకచో మంజాలశయ్యలందు నొకచో నుత్సాహముల్ పెంచు నిం, కొకచో నిందు నలంక్రియాదులను; బ్రిజ్ఞాల్ సంతసింపంగఁ గాం, కక రాజిల్లెడు రామకృష్ణ! వితా కళ్యాణలీలాగతుల్॥......

యిట్లువిధేయుఁడు

ద్వి॥ పుల్లకవి, దుగ్గాడ. 22-9-1910.

ఈయనకట్లు మనమేల వితిగి పోవలెనో? రాజింపుఁడు. తా. [illegible] దురదృష్టమ్మదృష్ట నంగాదికములు తల్లివెనుకఁ దల్లి యనఁదగిన [illegible]తల్లిలో[illegible]

వారికే రుచింపనియట్టి డితరబంధువుల కెట్లు రుచించును, ధర్మము బంధుత్వాదికము ననుసరించునది కాదుగదా, ఈ పుల్లకవిగారు వెం॥రాల పవిత్రయత్నము గూర్చి యిట్లు వ్రాయుచున్నారు.

30-7-1913.

......తే॥ గీ॥ గిరతమ్ము విమర్శించు గిట్రియొకటి, వెలువడుచు నున్నయది దాని వెనుకనుండి, నిజవిశేషమ్ములను గని నెగడవచ్చు...కుకవి కాండ వేదండఖాండవిఖండనాఢ్య.

ద్విభాష్యం పుల్లకవి,
గోదావరి, డి॥ పిఠాపురం, డి॥ దుర్గాడ.

ఇదియిటులుండె, మాశిష్యుని పెద్దతల్లు లిరువురు, వీరుకడుధర్మతత్పరురాండ్రని మాబంధువులెల్ల నెఱుఁగుదురు, ఆయిరువురలో నొకరిహృదయము వికృతవిషయమున నసంతుష్ట మని కనిపెట్టఁబడినది, అందులకు సూచకమగులేఖ 86 వ పుటలోఁ గలదు, అది వారిసౌహార్దమునే తెల్పునుగాని తక్కినవిషయములను దెల్పదు, దానింబట్టి తక్కినయంశము లెఱుఁగుదురుగాక, దానినివ్రాసిన కాఁకరపర్తి నారాయణమూర్తి మాశిష్యునికిఁ బెదతల్లి కుమారుఁ డని యెఱుఁగఁదగు, వేఱొక పెద్దతల్లిగారీతని ప్రకృతోద్యమమునకు మొదలేసమ్మతింపదు గాని అవిషయమున నేమిట వ్రాయనాధారములులేవు. ఆధారమే యక్కఱలేదనుఁడీ, ఏమాత్రమేని మనస్సనునది యొకటి యుండెనేని కృతఘ్నత్వ దోషము నది యెవ్వరినిగాని సంతసింపనీయదు కాన వారు వీరననేల, మాశిష్యుఁడు కృతఘ్నుఁ డేయగునేని యితఁడొనర్చుపనులు మనుజజన్మమెత్తినయేరికిఁ గాని యసహ్యములు గాకపోవని చెప్పసాహసించుచున్నారము. అదియటులుండె.

---

(1913 సం॥ అగస్టు 27వ తేదీ ఆంధ్రపత్రికనుండి.)

ఆంధ్రచంపూభారతము.

ఈ గ్రంథమిప్పుడు కవితాపత్రికయందు ముద్రితమైనది. పిఠాపురసంస్థానకవులగు రామకృష్ణకవు లీగ్రంథమును సాదరంబున తమకవితలో ప్రచురించుటచే గ్రంథోత్కృష్టత చాటుచున్నది...,, (తిరుమలవెంకటరమణకవులు).

పైపంక్తులవలన నాకవులకు వెం॥ రా॥ లయందుఁ గొండొక ప్రేమకల దని విస్పష్టమే, వీరు మాకడకంపిన పద్యములను 58 వ పుటలో ముద్రించి యుం

టిమి, వీరికృతఘ్నతాదుల విషయమున వారికిం గలయోతము నవి పూర్తిగా వెల్ల
డించెదిని, సార మేమనఁగా వీరి వాక్చాతుర్యాదికమును బట్టి బంధువులేమి లోకు
లేమి వీరిని మందలించు తలఁపుగలవారగుచున్నారు. త్రోవలేక వారిని వీరు
మాకు మిత్రులుగ నవలాపించి తన్మూలమునఁ దమకు శత్రుత్వమును సాధింపఁ
జూచుచున్నారు.

(కవికర్ణరసాయనమునుండి.)

క॥ కాకేమి తన్నుఁ దిట్టెనె?, కోకిల త న్నేమి ధనము కోకొమ్మనెనే,
లోకము పగ యగు పరుసని, వాకునఁ జుట్టమగు మధురవాక్యము కలిమిన్.

మాశిష్యుల వికృతస్థితి వైపరీత్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. మొదటఁ
దా మవలంబించిన పికత్వమే కాకత్వముగాఁ బరిణమించుచున్నది. దానిని వా
రింప నెవరితరము? ఇతరకారణములచే శత్రువులగువా రిట్టివట్టుల నేవేని యవ
కతవకలు తమ్ముఁ గూర్చి వ్రాసినచో నవి త్రోసి వేయ నగును గాని యట్టిది
లవమును లేనివారు శత్రువు లగుచుండఁగా వారించుట యెట్లు? ఈవిషయమును
సమర్థింపఁదగు నంశములు పెక్కులున్నను దిఙ్మాత్రము సూచించి వదలితిమి.
వీరికి గురుద్రోహ మనిన బెల్లమునుంగాదు. ఇది మాయెడలమాత్రమే యనుకొను
చుంటి రేమో? అట్లు కాదు, సార్వత్రికము, దీనిని సూచించి వదలుచున్నారము.

"భగీరథశాస్త్రులుగారు, వీరు సత్తములు,...యీయన యింజరములో ను
న్నప్పుడు భారద్వాజఘట్టములోని విశేషములు తెలిసికొనుటకై వెంకటరామశా
స్త్రిగా రాయన యొద్దకు వెళ్లినమాట సత్యమే"

ఇది కృష్ణకవివ్రాఁత, చదువుకొనుటకు వెళ్లెనన్నచోఁ బరువు దక్కువ
యని యెంచి కాఁబోలు, "విశేషములు తెలిసికొనుట" కని వ్రాసి పావుబండి తోల
మొదలిడినాఁడు, ఒకవిశేషము మాత్రమున్నది, కృష్ణకవివ్రాఁత నాఁగఁ జాలకు
న్నను వెంకటరామయ్య తానుగూడ నిందుఁ జేవ్రాలు జేయకుండుటచేఁ గొం
డొక సంతసింప వలసి యున్నది, ఈగ్రీరతవిమర్శన ప్రకరణమేమి, అట్టహాస
మేమి, కృష్ణకవిగారి వ్రాలుమాత్రమె కలవి యని చదువరు తెలిసియే యు
న్నారు, ఆయనయొద్దకు విశేషములు తెల్పుటకై వెళ్లినట్లు లిఖించినను లిఖింపఁ
గలసాహసి సుఁడీ కృష్ణకవి, అతని కసత్యమువలన లవమును భీతి లేదు, ఈ
యంశము శృంగభంగాదికము వలనఁ దెలిసికో వచ్చును. అతనికి దీటగువాఁడు

చర్లచలపతి, అతఁ డతని బావమఱఁది, అతనింగూర్చి వ్రాసినచో మాలేఖిని కెంతేని పనిగలుగఁ గలదు, 'యతో వాచో నివర్తంతే' శ్లో॥ కథాపీఠికలు...ఆశ్రియ సేయతః,, ప్రకృత మనుసరామః, భగీరథశాస్త్రులవారి యొద్దఁ జదివికొన్న సంగతి నొప్పికొన్నచో నావిద్యాభ్యసన కాలము ప్లవంగ సంవత్సరమగుటచేఁ దదనంతర భావియగు కీలక వత్సరములోనే వ్రాసికొన మొదలిడిన

ఉభయశాస్త్ర ప్రవీణత్వము,

ప్రబుకదు, ఇందునుగూర్చి గీగత ప్రథమభాగపీఠిక ౧౭ వ పుటలోఁ గొన్ని పంక్తులు చదువఁగోరెదము, దానిని ప్రతికింప వలయునని భగీరథశాస్త్రులవారి శిష్యత్వమును బృచ్ఛకత్వముగా మాకృష్ణసుకవియపలాపింపఁ జూచ్చెను, తన బావమఱఁది యగు చర్లచలపతి పెద్ద పండితుఁడని లోకమునకుఁ దెలియునట్టే కృష్ణశాస్త్రి కొండొక యపలపించెను. ఆసోదెవలననితనికిఁ బ్రయోజన మెంత యున్నది. "శృంగ భంగ" "సత్యసందేశముల" కవిత్వము తనది కాదని లోకము విశ్వసించుటయే దానికి ఫలము, ఎన్నియని చూపుదుము. ఇతఁ డసత్యమునకుఁ బుట్టినిల్లు. భగవంతుఁడును, దజ్ఞులును, ఇందులకు సాక్షులు, ఆచలపతి వ్రాఁత కీతఁ డిట్లు వ్యాఖ్యాన మొనర్చుచున్నాఁడు.

"వెంకటశాస్త్రిగారి బండారమెంతో కృష్ణకవి తేల్చెననియు, నావిదపఁ దిరుపతిశాస్త్రి వెంకటరామశాస్త్రులుగార్ల సంగతి చూచుకోవచ్చుననియు నందు గల యర్థము యథార్థమని ముమ్మాటికి వారు విశ్వసింతురుగాక."

("రాను రప్పింపఁ బనిగాన రాదు మాకు")

అను నప్రస్తుత ప్రశంసా వాక్యము నెఱుఁగనిలోకులు దప్ప నీవ్యర్థాలాపము నెవ్వరు విశ్వసింతురో.

ఉ॥ వేదుల రామకృష్ణులఁట? వెంకనసంటి? జయించునంటి? యెం, దో?
దురితంపుబండి నొగిఁ దోలెడిసాహసమందు; నింక నెం, దో? దుడు కందివ్రా
సి పయిఁ దోఁపక మి న్నసుటందు, నింక నెం, దో? తెలియంగరాద యది
యొక్కటియే సభ తేల్పఁగా వలెఁ"

అది యటు లుండె, పాపము? ఆచలపతి *క్షమాపణవ్రాసికొని నిర్దోషి యగుటకుఁ బ్రయత్నింపఁగా మరల నాతని నితఁడు దోషదూషితుని జేయఁజూచ్చెను జూచితిరా?

---

* క్షమాపణ, ఇది నింద్యగ్రామ్యమని వెం॥ రా॥ లశతఘ్నం. శ్లో॥ క్షమా

"చర్ల వెంకటాచలపతి శాస్త్రి, యను నతఁడు నాకు బావమఱఁదియే, ఈ యితఁడు వ్రాసినట్లుగా వెం॥ శాస్త్రిగారి ప్రోత్సాహముచే నచ్చటి విద్యార్థులలో నెవ్వరో వ్రాసిరి"

వెంకటశాస్త్రిగారి ప్రోత్సాహ మేమిటి? దానిపై నచటివిద్యార్థు లెవరో వ్రాసిరఁట? ('కృష్ణశాస్త్రిదన్తభంగః') అన్నట్టిట్లు వ్రాయు నితనిఁ దజ్ఞులు సంతసింప కుండుట కదు నయశస్కరము, తక్క-నయనత్యములును విగల్పములును నటులుంతము, ఈ విషయము నేని ధ్రువపఱచుటకు నితఁడు సభలో మా యెదుటికి రాఁ గలఁడేమో మా చదువరు లడిగి తెలిసి కొందురు గాక యని సూచ్యరించుచున్నారము. అక్షమాలిక చలపతి పేరితో నితరులే వ్రాసినచో వారిని శిక్షింపఁ జేయుట యుక్తము కదా? నేఁడు చలపతి పేర నిట్లు సృష్టించినవారు మఱి యొకప్పుడు రామకృష్ణుల పేరనే వేఱొక క్షమాలికను గాని, నోటును గాని మఱి యొకటిగాని సృష్టింప వచ్చును గదా? కావున నిట్టివట్టుల నౌదాసీన్య ముచితము కాదని కృష్ణకవికిఁ దెలుపుచుఁ దని చదువరులను మఱిమఱి ప్రార్థించుచున్నారము. ఇట్లే 'సుఖమస్తీతి వక్తవ్యముగాఁ గొంత సోద వెళ్లఁబెట్టెను, దానినెల్ల నూఁచకోఁతగా ఖండించినఁ బ్రయోజనము లేమి నింక విస్తరింప మైతిమి,

"అట్టియుత్తరములు మాయొద్దఁ గోటాను కోట్లు గలవు".

ఎట్టియుత్తరములు? గిరతములో, తి॥ వెం॥ కవులు ప్రచురించినట్టి యుత్తరములవంటివి, ఎన్నియున్నవి? కోటానుకోట్లు? పదులుగావు, వందలుగావు, వేలును గావు, లక్షలును గావు. కోట్లును గావు, ఇఁక నెన్ని? కోటానుకోట్లు? అబద్ధమాడినను నింతబట్టబయలుగా నాడవలయును గాఁబోలు; పోలు? పోలుకోటాను కోట్లనుఁ గాక, అర్బుదములనుఁ గాక, కృతఘ్నత్వము సుగుణమని వ్రాయు పెద్దమానిసు లేడదారకుదురో? ఆయాఁశమును బోధింపనియుత్తరము లేమి పనిచేయును? లేదా, శిష్యత్వము నేని యాయుత్తరము లవలాపింపవలెను, ఈరెంటికిని దక్కినయంశముల నెన్నిటిని యానితలస సాధించినను బ్రకృతమున కవి లవ

---

వర్ణ్యత్వదశాయాం తదర్థాః తత్త్వమిత్రియే (రసగంగాధరము) ఇందులకుఁ బాఠకులను కూడఁ జూఁచవలెను, అయినను దర్థనలెల్ల "గుణీభూత" ములన్ని పాఠకులను లన నైనట్లు వావిడుచు మాశిష్యులను సభాస్థానమునకు రప్పించుచో 'రిశాస్త్రుల ముమ్మన లేకుండుట కదు విచార్యము అప్పుడుగదానిగ్గు తేలును.

మును సతరాగింప వని యేమ వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు, ప్రధాన విషయమును వదలికొని యప్రధానవిషయములకుఁ బాటుపడు వీరి ప్రచారము వలన నీక్రిందిలోకోక్తి స్మృతికి వచ్చుచున్నది.

"జగతి శిరశ్ఛేదనసమయమందునఁ దనకుండలమ్ముల యాన గానెననంగ"

(యామినీపూర్ణతిలక.)

వీరు ప్రచురించు నుత్తరముల స్వరూప మెక్కింత గలదీ చూపి విమర్శించుట ప్రస్తుతము కాక పోదు గాన దిఙ్మాత్ర మట్లొనరించుచున్నారము.

(కవితాపత్రికలోని యొక యుత్తరము నుండి.)

(1) "...రసికత్వలోపమునకు జడిసి మానముల బెంచి కవిత్వమున మాపరాక్రమమునకు గానుంచితి మన్న నెవరు సహింతురు..."

ఇతరులు సహింపకుందురు గాక, దానికిఁ దగిన ఫలముం గూడఁ గాంతురు గాక, శిష్యపరమాణువులు సైఁప కుండుట తప్పగదా? అంత రుచింపనిచో లోలోఁ బరితపింపవలెఁ గాని.

"మీనమ్ముల్ పెలివెట్టి"

అని పత్రికలలో వెక్కిరింపు మని యవివేకి బోధించునే? తైఁగా నెవరో కొంటెతనముగా వ్రాసిన "రసికత్వలోపమునకు" ఇత్యాదియొకసక్కెపు మాటలను శిష్యులు ప్రచురించుట తప్పు గా దని చెప్పవా రెవరు, ఇంతకు నిద్దానివలనఁ దమకృతఘ్నత యేమి నివర్తించినది.

(2) "మీ రింకను గొంతకాల మోపిక పెట్టిన లోకము మి మ్మాధునికకవిసార్వభౌము లని యభినందించును"

ఆహా! తక కన్న నీ త్రాఁత యుక్త మన వచ్చును, ప్రసిద్ధులెల్లరు క్రమక్రమముగా గతించిన పిదప వీరినే యట్లు గౌరవించఁ దీర్ఘకాలము రావచ్చును "దొడ్డదు ... దొంగలు దోలుకొనిపోతే...గొడ్డు ...శ్రీమహాలక్ష్మి" యనును గదా, అభినవ్యకవిసార్వభౌమత్వమునకు మొట్టమొదట వీరొనర్పవలసిన ప్రయత్నము గురుద్రోహము యగునోటు? అందులకొ యాత్రానిక, బాగుబాగు? 1, 2, అంకెలు గుఱుతుగాఁ గల వాక్యములకు స్థానభూతమగు నుత్తర మొక్కటియే గాని,

అదివ్రాసినవారు మాత్ర మిరువురు, అందులో నొకరు ప్రాలుతుదను 'గారు' అని తగుల్చుకొన్నారు, అదికూడ మామీనముతలెనే యెందులకో తగుల్చుకొనిన ట్లూహింప వలసినదే, ఇంతటి తెల్వితేటలు గలవా రేమి వ్రాసినను వ్రాయుదురు, అట్టివారి పేరుల నిందేల ప్రచురింపవలెను. వలయువా రన్యత్ర చూడఁగల రని యుపేక్షించితిమి.

(3) "గీరతము నేతిబీరకాయగా భావించుకాలము రాకపోదు.

ఈవాక్యముకూడ, ఆ॥ "గారి" గారిదే, వీరభోగవసంతరాయఁడు పుట్టఁగలఁడని చెప్పనట్టియవ భవిష్యద్వృత్తాంతమును దెల్పి రామకృష్ణుల సోదార్చి పరామర్శించుచున్నట్లు వాక్యముల శైలి చెప్పుచున్నది, పరామర్శించువా రెంతో యాప్తులుగ నుండవలయును. కావున మా వెం॥ రా॥ లిట్టివారియుత్తరములను ప్రకటించుకొనుట స్వవచోవ్యాఘాత మని చెప్పక తప్పక వచ్చినది, మఱియు నింకెవరో మాకాప్తులుగా నుండువారే యొకసందర్భమున.

"పిచ్చిపుల్లయ్య"

అని వెం॥రా॥లకు వ్రాసిరఁట? ఆవ్రాఁత యితరోద్దిష్టమైనను నయ్యది యెట్లో మాలో నొకరికి సందర్భించునఁట? దానింబట్టి వీరికేమి ఫలము కల్గెనో కాని యాసోదె కొంత వెళ్లఁబెట్టిరి' ఆయాయనుపయోగ పరితాపమెల్ల నేసందర్భమునందలిదనుకొంటిరి? మా 'పాశుపతమును, ఖండింపఁ బోవుటకు వ్రాయను పోద్ఘాతములోనిది, శాస్త్రము నుపయోగించుటకు వీలులేనియప్పుడు తా మింతకన్నఁ జేయవలసిన గత్యంతర ముండఁ బో దని యాసోదెకుఁ దాత్పర్య మనునది యావదర్థము, ఏపిచ్చిపుల్లయ్యయో యెదియో వ్రాసెను, దానిని ఖండించుట యుక్తమో? ఎవరో "పిచ్చిపుల్లయ్య" అనిరి గాన మేమును 'పిచ్చిపుల్లయ్య' అనియందుమనునది యుక్తమో విజ్ఞులకు నొకరు తెల్పవలసి యుండునా?, అదియటులుండె, వెం॥ రా॥లు, దమయజ్ఞతను నిరసించువారినెల్ల నేసంబంధము లేకున్నను మాకు మిత్రులనుగా నపిలపించుచుఁ దమకు శత్రువులుగా భావించుచున్నా రని యింతకు ముందే ప్రసంగించి యుంటిమి, అందులకిఁక నొకయుత్తర ముదాహరింపఁబడుచున్నది.

"వెం॥ రా॥ కవులు మేము అశ్వమేధమున పద్యములు ప్రకటించితి మనుమరభిప్రాయముతో కవితాపత్రిక వెనుకటివలె రు 1—0—0 కి పంప మనియు

పూర్తి వెలకు గాని పంప వీలు కాదనియు వ్రాయించిరి. యింతకన్న మమ్ము మీ రేవిధమున సాధింపఁగలరో..." • .శేషాద్రిరమణులు (సోదరులు)

తమయకృత్యముకై తమునఁ దమవలని లాభమునుగూడ గణింపక తమమిత్రులు తమకు శత్రులగుచున్నారను నంశమున కింతకన్న దృష్టాంత మేమి కావలయును? ఎవరో——

"భంగుమేదుత్తూరులు"

తప్పనుజనులెల్లరుఁ దమయకృత్యమున కేవగించుకొనువారే కద, 61 వపుట 25 వ పంక్తిలోని చామర్తి జగ్గారావు తమకెట్టిబంధుగుఁడు, అతనికిగీరతమునం దానక్తి యుండుటకుఁ గారణమేమి, పైఁగా నితఁడు, వెం॥ రాలకు, సహాధ్యాయి, బ్ర॥ శ్రీ॥ మధునాపంతుల సూరయ్యగారివద్ద వీరు మాగురువు గాళిదాసత్రయమువటుకో, అంతకొకింత తక్కువగనో చదివినవారలు, అట్టిచో నతఁడు గీరతమునభిలషించుట కర్థమేమి? అంతకన్న నెక్కుడుగ వారియాత్మబంధువు లేమి వ్రాయఁ గలరు,64 వ పుటలోని15 వ పంక్తిలోని ఆకొండి సుబ్రహ్మణ్యముగా రెంతమర్యాద కలవారు,ఆయన మాశిష్యుని పెదతల్లికుమారుఁడగు బ్ర॥శ్రీ ఆకొండిరామమూర్తిగారికిఁ బినతండ్రి, అట్టివారెల్ల మాగీరత కావ్యము నేలయాదరింతురో?,63వ పుట 24వ పంక్తిలోని, ఆకొండివెంకటశాస్త్రిగారు, దూరదేశస్థులు, మాయుభయులకునుశాఖామాత్ర బంధువులే కాఁదగువారు, బాగుగవిచారించినచో బ్ర॥ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రులవారికి దూరపుజ్ఞాతులేని కాఁదగువారు, వారినిబట్టి వెం॥ రా॥ లకే బాంధవ్య మెక్కుడనక తప్పదు, వారు మా 'గీరతము' నందేల ప్రేమ చూపవలయునో?, ఇట్టివారికెల్ల నేదో 'పక్షపాతిపదమునో' మూర్ఖపదమునో, నివేదించి తమమార్గమును దాము వదలక మాకుఁ బనికల్పించు మాశిష్యుల నెవరు సన్మార్గమునకుఁ ద్రిప్పఁగలుగుదురోకదా, వీరెల్లరును మాయొద్దఁ బుస్తకములు వెలలేకుండ సంగ్రహించుట కట్లువ్రాయుచున్న వారలఁట? ఆమాటకే యొప్పికొందము, తమవద్ద నట్టిలాభమును బొందువారుకూడఁ దమమార్గము నేల నిందింపవలెనో? నరములేనినాలుక యిచ్చవచ్చినట్లుదిరుగును, అంతియ కాని ప్రాజ్ఞులగువారు కూలికి వినమెన్నఁడును వ్రాయరు, అందులో నొకపుస్తక మూరకవచ్చునంతలోఁ గలుగు ఫలమెంతటిది, అదిగాక

వెం॥రా॥ ల, గీరతవిమర్శనమునకుఁ గృష్ణాపత్రిక చూడఁదగు.

'అపుస్తకమేని "కుక్కమూతి పిందె" గాని తనపత్రమైనది కూడఁ గాకుగదా, అట్టిపాడు కాగితపు చెత్తకట్ట గాంచి యోప్రాజ్ఞులుగాని తమ్మును గర్హించి మమ్ము నర్హించుచున్నారని వ్రాయుట స్వవచో వ్యాఘాతము కాక మఱేమి, దాని తత్త్వమిది. ఎవరుగాని పాపకార్యమునకు ననుమోదకులుగా నుండవెఱతురు, పుణ్యకార్యమునకో నిస్సంశయముగాఁ దోడ్పడుదురు; ఇందు లాభాలాభముల కించిత్కరములు, అదిగాక, స్వల్పలాభములతోఁ బనియేమి, వారలకు మహాలాభమొకటికలదు, అది పుణ్యపాపసంపాదన రూపము, దేనిని గోరువారు దానికను మోదకు లగుచుందురు.

శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః,

ఇంతతో నీవిషయము ముగించి విషయాంతర ముపక్రమింతము. చదువరులారా! వీరి "కోకిలకాకము" మకుత్తైమేము వ్రాసిన పద్యములకుఁ బరిమితియే లేదు. కాని నానాఁటికి వీరి గోలనుండి విరమింపవలెనని యూహపొడముటవల్లను, సత్యమిదియని ప్రాజ్ఞలోకమునకు విస్పష్టమగునట్లు వారి వారి లేఖలవలన మామదికిఁ బూర్తిగా నచ్చుటవల్లను, బాలపద్యములను దిగవిడిచితిమి, అందుఁ గొన్ని మచ్చుచూపుచున్నారము.

చ॥ "గరునగునే పికస్వరపికస్వర మంటివి, వారిదార్భటీ
భర భరితాంతరంబగు నభస్సు "గుభాలు గుభాల్ గుభాలు" మం
చుఱుముఁగ విద్యుదుద్యదను ఉల్లసిలం గరుసాను? సారెకున్
విరుసగుసూ? పికధ్వని కపిధ్వనియై తలక్రిందు లాడుసూ?"

శా॥ గాంభీర్యంబది యున్నయంతఁ దెలిపెన్ గాకి పికత్వ, మ్ముదే
దంభం, బెక్కుడ నేర్చె నీయనృతవాక్తత్త్వం? బెవండిచ్చె? నీ
యంభోవాహవిహారఘోరవిపులవ్యాహార బాహుళ్య ది
క్కుంభి శ్రీపతి ఘీంకృతుల్ వినియు మీ "కోకో" ధ్వనుల్ నిల్చునే.

మ॥ నభలో లేవదు కాకమున్ గనము, తత్ప్రావణంబు మానార్థమే
ప్రభవై లేచినవెంటనే తపులు దుర్వారం బనధ్వాన దూ
రభసం, బయ్యది నిల్వ నీయదు సుమీ! ప్రాక్షత్రివోనిద్ధ సౌ
రభ సౌభాగ్య తరంగరాగ్రిమా మాత్ర స్వైర సంచారులన్,

బించినది గురుద్రోహయజ్ఞ దీక్ష, దానికి వ్యతిరేక మగుధర్మమును. బోధించునది వ్యాసభారతము.

"భారతః పంచమో వేదః"

అని దానిని పూర్వ ప్రాజ్ఞులేమి నవీనవిజ్ఞులేమి శిరసావహింతురు గాక, ఇతరపంచమవేదములయం దభిరుచి నించి తిరుపతి వెంకటేశ్వరాది దేవగురు నిందల నొనరించు వీరి కాపంచమవేద మెట్లు ప్రమాణము కాఁగలదు, కావుననే వారిప్రవృత్తి కనుకూలముగా వేఱొక భారతమును మూశిష్యులు వ్రాసికొనఁ దలఁచిరి.

ఉ॥ వ్రాయఁగ వచ్చువ్యాసముని వర్యుఁడు వ్రాసినయట్టి భారతా, మ్నాయములోనియంశములు మాటిచికూరిచి వేఱెభారతా, మ్నాయము ... నమ్మరుగాక, పండితుల్" (ఆంధ్రభాషా పరిషత్పత్రికలోని కౌరవగౌరవము చూ.)

ఇంతకు మున్న "శుక్ర-మూలిపిందె', అని మాగీరతము నే వీరు దూషించినట్లు ప్రథమభాగపీఠికయందుఁ జూపితిమి, ఇప్పటికి వీరికి భారతముగూడ నట్టిదశకే వచ్చినది, ఇంతతో నేమయ్యె, ఇంకను వీరిచర్యలు వీరివ్రాఁతలు ముందు చూడ వలసి యున్నది, పండితులు నమ్మరఁటగాని లేకున్నచోఁ దలక్రిందు సంగతులతో వీరు వేఱొకభారతము వ్రాయుదురంటఁ.

శ్లో॥ ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం,,

అని కాళిదాసంతమహాకవి వాక్రుచ్చినది వీరికిఁ దృణప్రాయమే, ఏగ్రంథముగాని పండితులమెప్పునకును, అపండితుల తిప్పనకును, నాస్పదముగా నుండఁదగు. ఆయీయంశము ప్రథమభాగ పీఠికలోఁ గొండొక వివరించితిమి, ఇఁక నన్నచ్ఛిష్యోపజ్ఞకమగు కృతఘ్న మతమున కనుకూలించు నొకవ్రాఁతయు దానికి మారకమగు నింకొకవ్రాఁతయు నుదాహరించుచున్నారము.

"ఈ కాలమునం దొకరి నొకరు తిట్టుకొనుటయే కవిత్వ మైనది, అతిశ్లేషయామ్నాయము లైనవి, భారతామ్నాయముతోఁ దుల్యములఁటగాని, మూర్ఖులు వానినే యాసక్తితోఁ బఠించుచున్నారు.

ఇటువంటివారి శ్లేష వ్రాయుట యుక్తము, ఇతఁడు లేశమును సహృదయుఁడు గాఁడనుట కాఘట్టనందలివే యీక్రిందిపంక్తు లుపోద్బలకములు.

"......ఈవాక్యములు కాదంబరిలోనివి,...ఇవ్విధమున సందర్భము లేనియుపమలయొక్కయు, శబ్దశ్లేషలయొక్కయు, జాబితాలు కొండవీటి చేదత్రాళ్లవలె ...సొప్పారు కాదంబర్యాదులు..."

---

కాదంబర్యాదులే నీరసగ్రంథము లని తలపోయు జ్ఞానలవదుర్విదగ్ధులకు మాగ్రంథములేల రుచింపవలెను? రుచింపనక్కఱలేదు. అది యటులుండె, సహృదయులిట్లు శ్లాఘించుచున్నారు.

(సుదర్శనిపత్రికనుండి,)

"గీరతమహాకావ్యములోఁ గాని యిటీవల గుంటూరిసీమలోఁ గాని యొక్క పద్యమునకు, ఈ చదువరి మున్నగువారి యుపనిషదువ్యాఖ్యానములు తుదకు "అసావాదిత్యోబ్రహ్మ" చేయించుటకైనఁ బనికిరావు, మెదడులో నేమాత్రపు గ్రహణపునర లున్నను, సహనబుద్ధి యున్నను, గీరత కావ్యము లోని శాంతిపు వర్గములో నొక్కపద్యముఁ జదివి భారతీయముక్తిసౌధ మెక్కి తరించఁగలరు, లేనిచో సన్నిపాతరోగికిఁ జక్కెఱయుఁ జేదే, యెవ్వరేమి చేయఁగలరు?

వా రట్లు నిందించుటకు హేతు వేదో గాని వీ రిట్లభినందించుటకు హేతు విది, భారతము సకలసుకవిజనవినుత మేల యయ్యె, కేవలకవిత్వ ధర్మమును బట్టియా? కాదు, దీనింగూర్చి వ్రాసినచో నింతట సంతటఁ దేలదు, భారతమునఁ బ్రధానరసమేదియో, తెల్పుఁ డన నీనాఁ డెందఱో చేతులునలుపవలసినవారు కలరు, స్థూలదృష్టికి నందు వీరరస మేమో ముఖ్యమని తోఁచను వచ్చును, అది యట్టిదియే యగుచో దానికి నేతాదృశగౌరవము రాదు అందలి ప్రధానరసము శాంతము, ఈయంశమునకు,

"...భారతే శాంతిః, రామాయణే కరుణ, ఇతి, ఏవం రసాదిధ్వనయ ష్షడ్విధాః॥

అను సాహిత్యకౌముదియు, మఱియు ధ్వన్యాలోకమును ప్రమాణములు, అట్లు కొన్నిపట్టుల వివాదప్రధానముగా స్థూలబుద్ధులకుఁ బొడకట్టినను, మాగీరతముకూడ శాంతరసప్రధాన మనుట నిర్వివాదము, కావుననే యిది ప్రాజ్ఞులనుతికిం బాత్రమైనది. తదితరులు విద్వల్లోకమునకు సహజశత్రువులు.

(1) శ్లో॥ మూర్ఖాణాం పండితా ద్వేష్యాః'' (భారతము.)

(2) శ్లో॥...బుధజన ఇవ గ్రామ్యవదని, (కాళిదాసః)

# XXI

వత్తు లిటుండఁ బోవు సుమీ; పాపము నొందెదు సుమ్మి పైన నీ
చిత్తము చేతనైనటులఁ, జెప్పితి నించుక మూఢచిత్తమా. ౩

ది 27-6--03 సం॥రం.

ఓలేటి వెంకటరామయ్య.

పైపద్యములు మాశిష్యుఁడు మాకడఁ జదువుచున్నకొనఁ బోవు దినములలో రచించినవి, అందులకందుఁగల తేదీప్రమాణము ఆతేదీ శోభకృత్సం,, ఆషాఢ శుద్ధ తృతీయా శనివారమునకు సరిపడును, ఆసం॥ జ్యేష్ఠములో వెంకటశాస్త్రి యింటి యింజరములో నూతనగృహప్రవేశము, అంతవఱకితఁడు శ్రద్ధగాఁ జదువు చున్నవాఁడే, ఇందుల కాగృహప్రవేశమునకు వచ్చినవారెల్ల సాక్షులే, విద్యాభ్యాసారంభము శార్వరి సం॥ శ్రావణము, ఈమూఁడువత్సరములును, అప్రస్తుత ప్రశంసలో మూఁడుమాసములుగాఁ గృష్ణకవి యపలపించెను, దానింగూర్చి యిందు ప్రస్తావించుటకన్నఁ ప్రశంసాఖండనముకుఁగా నేర్పడిన లోకాభిరామాయణములోనే ప్రసంగించుట యుక్తము, పైపద్యములకాగితము మాశిష్యునివ్రాలుంటయే కాక యతని స్వహస్తలిఖితాక్షరములు గూడఁగలది. కృష్ణకవి దీనినెట్లో యపలపింపక మానఁడు, చర్లచలపతి క్షమాపణలేఖ కన్న దీనియెక్కువ యేమి.

"న సాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి"

ఈకారికి నతఁ డసత్యవిషయమునఁ జేయూఁతగా గ్రహించుచున్నాఁడు అది యటులుండె, ఆపద్యము లిప్పటియితని 'దేవగురు నిందాత్మకమగు మతమునకుఁ దోడ్పడవు' ఈమత మిటీవలకుక్షింభరిత్వ ప్రయుక్తమైన గురుదూషణను సమర్థించుకొనుట కవలంబించినదియే, దీనిపేరేమి? వివేకదారిద్ర్యము, అదియవలంబించినవారి కొకమతమేమి, యొకప్రత్యయమేమి, యొకతెన్నేమి.

"శ్లో॥...వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః"

అనుభర్తృహరి బుద్ధివిహీనుఁడా? శాంతం పాపం, ఇట్టివీరివ్రాఁతలనేల విమర్శింపవలెను? విమర్శించునంతటి మూర్ఖులను.

"కొయ్యతోఁటకూరకును సిగ్గు లేదు, కోడవఱికిని సిగ్గు లేదు"

అని చదువరులు నిసిగికొందు రని మేమెఱుఁగుదుము, కాని మాశిష్యవరమాణవు లిరువురలో రెండవవానిని లిఖియించు ననృతములకుఁ బారము లేక-యుం

శ్లో॥ త్యాగాయ సంభృతార్థానాం, సత్యాయమితభాషిణాం, యశసే విజిగీషూణాం, ప్రజాయై గృహమేధినామ్.

(ఇతి కాళిదాసః)

ఓమ్, సత్యం తపః, నాఽనృతం వదేత్.

ఇట్లు
తిరుపతి వేంకటేశ్వరులు.



## శుద్ధాశుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 3 | దురా | దురాత్మ |
| 7 | 2 | బాఁప | బాప |
| 7 | 25 | బిట్ల | బిట్టు |
| 12 | 25 | దగ | గద |
| 14 | 19 | ధీర్ఘా | దీర్ఘా |
| 30 | 1 | గుభక్తి | గురుభక్తి |
| 31 | 15 | శ్లో దివం | శ్లో॥ దివం |
| 33 | 20 | సాఁకు | సాకు |
| 45 | 23 | వగుట | వగుటనై |
| 45 | 28 | హైత్రి | హైంత్రి |
| 52 | 15 | యుండి | యుండి |
| 56 | 8 | వ్యంమ్రు | వ్యమ్రు |
| 56 | 17 | రిష్టంత్వ | రిశిష్టత్వ |
| 75 | 10 | లైడిసం | లైడియం |
| 84 | 16 | అపరశి | అపరశ్న |

స్థూలదృష్టిచే దిద్దిన వీనివలన వీని సజాతీయములను గూడ దిద్దికొనఁ గోరుచున్నారము.



శ్రీమత్పరదేవతాయై నమః.

# గీరతము, గురుదక్షిణ.

(రెండవభాగము)

## (1) ఆశీర్వచనపర్వము.



క॥ కౌత్సుఁడు గురుదక్షిణ యిడ, నుత్సాహం బెంతయేనియును జూపఁగ "నో
వత్సా! వలదనియెఁగుణ, వత్సలు వరతంతుమౌనివరుఁ బ్రణుతింతున్ ౧

ఉ॥ తప్పక నైకొనంగఁ దగు దక్షిణ దేవర యంచు వేఁడుచో
తప్పుగ నెంచి శిష్యుపయిఁ దాఁగను లెట్టఁగఁ జేసి "పొమ్ము తె
మ్మిప్పుడ కొన్నికోటు"లని యేగురుఁ డానతివెట్టెఁ దత్కథన్
జెప్పిన కాళిదాసకవి శేఖరుఁ డెల్లజగమ్ము నేలుతన్. ౨

తే. గీ॥ అంతముకోపి నంత దయార్ద్రచిత్తు
నంత నిస్పృహు నంతధనైకలుబ్ధు
శాంతు సంతోషవంతుఁగా నలుపుకౌత్సు
చరిత దురితాపహము సర్వసమ్మతంబు 3

క॥ గురుశిష్యధర్మముల నెఱుఁగరు పల్వురు పెద్దలిపుడు కలికాలవశుల్,
తిరుపతి శాస్త్రిగారల, కొలుకుఁ జూమీ గిరతాఖ్యగురుఁ డేర్పడియెన్॥ ౪

క॥ గురుదక్షిణనూటార్లు *శి, వరామకవి నాకు నిడఁగ వచ్చినకంటెన్,
బరమానంద మొసంగెడి, గురుదక్షిణ చూపె "కాకకోకిలము" సఖా.॥ ౫

---

(బెజవాడ శతావధాన పీఠికనుండి.)

*......అట్టిబహుమతిని నవధానిగారు (శివరామశాస్త్రి) తమకుంగల గురుభక్తిం బ్రకటించుచు బ్ర॥ వేంకటేశ్వరశాస్త్రులగారి కొసంగిరి కాని వారు నిఖ

క॥ *కోకిలకాకముఁ గంటివె, యేకళగా నున్నదో యి హీ? యని నగరే
కోకిలకుఁ గాకియెడ గురు, తాకల్పన మెట్లుకుదురఁదగునో యకటా. ౬

సీ॥ తాను నాయొద్ద వృథాగ శుశ్రూష చేసెనె కాని విద్దె చెప్పనఁట? నేను
విద్దె చెప్పుటకేమి కొద్దిగానైనను జ్ఞానంబు గలవాఁడ గానఁట! నేను
పొరపాటుచే నాదుచరణ మంటెనెకాని తా నంతమున్నె విద్వాంసుడంట?
పొట్టకై తిరుగు దెప్పుడు నాదువనియంట! యక్రుతమ్ము స్రవన రవలతయైన

తే॥గీ॥ విద్దె చెప్పనె లేదంట! వినిగిపోయె, నఁట! చెప్పినముక్కైన నంతమంచి
ముక్క గాదంట! చప్పనిముక్కయంట?, పదపదియ్యనిముక్కలుచదివెనంట

సీ॥ వనితనం బరిగినకై నేను మూర్ఖుఁడ నని తాఁ దెలిసెనంట! యంతమీఁద
భంగపడితిఁగదా! భగవంతుఁడా యంచుఁ జింతించి చనెనంట! యంతలోన
నంతంబు బుతువంట! జాతి సులభమైన విద్దె యబ్బినదంట! వీను లలరఁ
గవిత చెప్పెడినేర్పు కలిగి రసాలంబు నాశ్రయించిన దంట! యకట! కంచి

తే॥గీ॥ గరుడ సేవయెకాని నాశాల్లఁబడిన, ఫలము లేదంట! యెందుకో తెలియదిట్టి
పాడు వ్రాఁతలు, విన్నవార్జోడుకంక, దృష్టి నిగిడింతుఁ రనియేనిఁదెక్షయఁబడదా

---

క్రియ నాకు వేయిన్నూటవదారులని గ్రహింపరయిరి......

ఇట్లు, గొల్లపూడి లక్ష్మణశాస్త్రి.
బెజవాడ, సీ- యం- యస్- హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు.

☞ ఈక్రిందిపద్యములను గడుశ్రద్ధగా మదికెక్కించుకోవలయును

(నవంబరు 1910 వ సం॥ కవితాపత్రికనుండి.)

# *కోకిలకాకము

గీ॥ బలునకు మఱంది; కృష్ణుని బావ జెట్టి, యు నగు భీముసకోడి సుయో ధనుండు, ధైర్యమునుగోలుపోయి యెద్దానడాఁగి, నాఁడొయదియొందు ద్వైపాయన హ్రదంబు. 1. గీ॥ అమడువుచెంత నీరనంబైన చింత, కొమ్మపైఁ గూర్మిమైఁ గులాయమ్మొక్కఁడు, గట్టుకొని యందుఁ బలుగాకి కాకియొకటి, లాఁతికవులొకకొన్ని గొల్వఁగవసించు 2 క॥ కాకవులువాఁడు నాఁడును, నీకంఠస్వరమువర్ణనీ

తే॥గీ॥ ధనికుల గృహస్థులఁట! యేను గునికి పాటు,
లచటఁబడుచుందునఁట! ద్వారమందుఁ దాను
భక్తితో నప్పుడును గూడఁ బాయకే యు
నర్చునఁట! సేవ, ఫలము నున్నయఁట! తుదకు. ౯

సీ॥ తనసిరికోర్వక తప్పులు తనకబ్బములను బట్టెదనంట! యెలమి నొకట
నెట్టులేనియు నన్ను నీవు దేశికునిగాఁ జెప్పికొమ్మంచు యాచించితినఁట!
తాను గోకిలమాటఁ దిన్నంట! కాకినౌనను గురుగాఁ జెప్పికొనెదు నెడల
నయినను జెప్పట కంగీకరించెనం టామీఁద లోకు లీయంశము విని
తే॥గీ॥ "కాకమఁట! తాను గురువఁట! కోకిలకఁట!,
యిందులకుఁ గోకిలము కింత యేసి సిగ్గు
లేక యెటు చెప్పికొనియె నుశ్లోకులకడ,
నంచు నచ్చెరువడి రంట! యనఘులెల్ల ౧౦

---

యాంబని తన్నేకొని యాడఁగ నదిసిజ;మేక దెగియనితలఁచి వాయసేశ్వరుఁ డెగయుఁౙె. గీ॥ క్రమముగా గర్వమధికముగాఁగ గాయకోత్తముఁడ నేనటంచు నూరూరఁదిరుగు, కాకి పలుగాకిమూఁకలఁ గలసిమెలసి, కడకు గాయకబిరుదమ్ము గట్టుకొనియె 4 సీ॥ ఒకసారిపొగరెక్కి శుకశారికాదులఁ గయ్యంబునకుఁబిల్చుఁ గాలుద్రివ్వి, నొకమాఱు కాకవిప్రికరంబు తనతీరువినుతింపమత్తిల్లి విఱ్ఱవీఁగి, యొకవేళ వెడఁగుబాలకులు గాలికిముప్పఁ గట్ట మిన్నులుముట్టుగంతువైచి, యొకనాఁడు తనపాటలకు మెచ్చు పక్షులఁ జేరి "కా" యని హాయి నోరుదెఱచి గీ॥ వేఱొకప్పుడు తనరూపవిభవమెల్ల, వారుఁ గనుఁగొని యచ్చెరుపాటునొందఁ, దలఁచి పటపట ఱెక్కలుదులుపుకొనుచు నెక్కుడుయెండిన చెట్టుపైనెక్కినిక్కు. 5 క॥ ఏకడకు నేగినప్పుడో, రాజామరుల సౌధశేఖరంబుల ప్రాలుం, గాకవికటంబుగా మన' కాకేశ్వరుఁడంతమాత్ర గరుదుండగునే? 6 చ॥ కొలఁది యెఱుంగలేని యెల కోయిల యొక్కఁడు వాయసేశ్వరు, న్గ్వలఁతియకాఁ దలంచి తనవారలఁ జీరికిఁగోక ముద్దుగాఁ, బలుకునదయ్యు గానమునఁ బాండితి నెక్కుడు సంగ్రహింపఁగాఁ, దలఁపునఁ జేసి వాయస పదంబున కేగె ముదంబు పెంపునన్. 7 ఉ॥ జ్ఞానము లేని వాయసుఁడు గాయకుఁడంచుఁ దలంచి వానితో, గానము నభ్యసింపఁగఁ బికంబు నభిజ్ఞత నేగుదేరఁగాఁ, దానును గాయకుండనని తత్త్వము మార్పడఁ జేసి దానికిం

క॥ అచ్చెరువిటఁ జెందెడి,యీనవ్చరితులు! మీరుఁగూడ జగమునఁ గలరే!
పొచ్చెము లేక వచింపుఁడు, చచ్చెనె? మీ యెడలఁ గూడ జ్ఞానలవంబుల్ ౧౧
క॥ గురువుల్ "గురువని" చెప్పిన, దురితమ్ము సహింపరోటు! దురాగ్రముగాఁ
బరికించితే మీరలు, సరిగా వచియింపుఁ డయ్య! సజ్జనులారా ౧౨
క॥ క్షమియింపుఁడు మీరను లో,కమునం దున్నారటంచుఁ గాంచనుజాం డో
యమలాత్ములార? యీయఁ, క్రమపుల్ వ్రాఁతలకుఁ జేయి కదలుట యెట్లో ౧౩

---

గానము సెప్ప సిద్ధపడెఁగాకము లోకము వారు నవ్వఁగన్ 8 క॥ లోకోత్తరమ
గుగానము,కోకిలడింభకము చదువుకొన వచ్చుటనెం, తో కుటకుచుమన్నించెను,
గాకిగుణంబెవ్వఁడేని కాఁదనగలఁడే 9 గీ॥దినదినము మేఁతకై దేశదేశములకుఁ,జ
నుచుఁగలవారిముంగిళ్ళఁగునికిపాట్లు, పడుచునుండినవిహవకభక్తితోడఁ,గొలుచుఁ
గోయిలవిద్దెపైఁగలుగుపేర్మి" 10 ఉ॥గొప్పకు నెందుఁబోయినను గోయిలఁ దోకొని
పోవుఁగాని దా,నెప్పుడుఁబొట్టకూటికొఱకేతిరుగాడుచునుంట నేమియుల్, జెప్పదు
కాకి కోయిలకుఁ, జెల్లియొకప్పుడు నెప్పఁజూచినన్, జప్పని కూఁతదక్క సరసం
బగు పల్కు కఁ డైన రాదుగా.12 గీ॥ ఎన్నఁటికినైనఁ జెవులకునింపునింపు, నొ
క్కపలుకేని తెలుపదో? యటంచుఁ, గోకిలము పుట్టెఁదానతోఁ గొలిచెఁగాని,
యెప్పటికి దాఁకోర్కెయీడేరదయ్యె13 క॥ ఎఱుఁగదు పికపోతము దన, గురువున
కుం గలుగువిద్య కొలఁదిఁ బనితనం,బరిగినపిఱుందనే య,త్తెఱఁ గంతయు దాని
కొఱ్ఱుఁ దెలియఁగనయ్యెన్ 14 గీ॥ కాకివైఖరి మనమెఱుంగనిది కాదు,కాకి గా
నము క్రొత్తదిగాదు మనకు,గండుఁగోయిలపిల్ల యకాల్కెలమందుఁ, బనితనంబొటఁ
దెలియక భంగపడియె. 15 గీ॥ చాలఁ గాలంబు వినిగి వేసారి తుదకుఁ, గాకవికి
గాణతన మెట్లు గలుగు ననుచుఁ, దెల్లమగుటయు మిపులఁ జింతిల్లిపికము. కాక
మును వీడి తనవారిఁ గలసి పెలఁగు 16 గీ॥ అంతఁ గోయిలపిల్ల వసంతకాల, మ
వతరింపరసాలమునధివసించి, సరసులెల్లరుమెచ్చ స్వజాతి సులభ, మయిన గా
నంబు కర్ణపేయంబు సేయు 17 ఉ॥ కోయిలపిల్ల మేలుతనకుల్ లభియింపకయుంటఁ
జేసి య,త్యాయత మానసూయ హృదయంబుఁ గలంప నహర్నిశంబు న, వ్వా
యసమూర్తి భూమిఁగలవారికిఁగోయిలపాటఁ జేఁదుగాఁ, జేయుతలంపునం జెవులు
చిల్లులు, వోవఁగ గూయు నీగతిన్.18 గీ॥ విబుధవరులార! కోయిలపిల్లపాట, కర్ణ
పరుషంబు; మున్నునాకడనె విద్య, నేర్చె;దీని కొంకింతయు నేరువు; కల,కంఠములు

సీ॥ నాకంఠరవము వర్ణన చేయుమీరల్లఁ గాకవులంట! యక్కట! తన నాకు
గర్వం బెదిగెనంట! కాలికి ముద్వంట! గట్టినారఁట! పలుగాకినంట!
పటుతరంబుగ నేను బటపటకొక్కులు దులుపుకొంచు సంచరింతునఁట! యకట!,
తాను నాయొద్ద విద్యను నేర్చుకో రాఁగ మన్నించి చెప్పినమ్మంచితనము
తే॥గీ॥ గూడఁ గూడనిపని యంటఁ? గొప్పకంట!
తన్నునే వెంటఁ దోకొని తరలుటెల్ల
నంతియే కాని చెప్పలేదంట! యక్కట,
యెక్కడున్నాఁడొ భగవంతుఁ డెందు లేఁడొ!, ౧౪

క॥ ఔరా! భగవంతుఁడ! నీ, నేనుపు మెచ్చంగ వచ్చు నేఁటికి సృష్టి
ప్రారంభ మాది యిప్పటి, కీర్తి మహాత్మ్య జగతి కిచ్చిన కతనన్ ౧౫

---

గౌరవార్హముల్ "కావు కావు" 19. గీ॥ చాలఁగాలమునుండి మచ్చుటగఁ బాడు, కాకములసామ్ము గానము; గాని మొన్న, మొన్న నాయొద్ద నేరుచుకొన్న పికము, కలరవమ్ములు మధురముల్ "కావు కావు" 20 గీ॥ కాకియోర్వఁగలేక యిక్క రణి నెపుడు "కావు కా"వని కూయునకాని ధరణి, నెఱుఁగరొకో కలకంఠము నెల్ల వారు, వినరొకో? దానిగానము వీనులార. 21 క॥ కాకము దనకొక గురువని, యే కోయిల నెప్పనైన నేమి యనూయుం, జేకొనిపికముం గాకం, బేకరణిను నిందలా డనేతలపోయున్ 22 గీ॥ కాకి యొకనాఁడు కోయిలకడకు వచ్చి, యోరి! పికపో త! నీగర్వమధికమయ్యె, తొల్లి గానంబునెల్ల నాతోడఁ జదివి, కృతమెఱుంగవు నీ కింత కేరడంబె? 23 క॥ అంచున్ గొంచువచంబులఁ, జంచువుఁ గదలించి వాయసము దన్నున్ యా, చించిన నుజ్జ్వలమ్ముఁ బ్రబలించెదననికోకిలమ్ము రేపున్ మాపున్ ఉ॥ తేఁకువగల్గువాఁడు పరదేశములం జరియించువాఁ డతి, శ్లోకుఁడు వేఁపపండ్లు దిని చొక్కెడు కాకవిసార్వభౌముఁడే, నాకు గురుండు నమ్ముఁడనినన్ మనకోకిల పాక; మేలొకో, లోకము వారు సమ్మరది లోపము కాదుగ వారిబుద్ధికిన్. 25 ఉ॥ కాకము గాయకుండఁటఁ? పికంబునకుం గురువంటఁ? తన్నుఁ గూ, శ్లోకులలోన వాకొ ననిలోపము కోయిలపిల్లదఁటఁ? తా, నేకదుధర్మవర్తి యఁట? యిద్దగుణుండఁట? విం టిరయ్య! యీ, సాఁకులఁటంచుఁ జెప్పకొన సాగిరి లోకులు వింతవింతగన్. 26 క॥ కోయిలకుం గురుఁడను నే, నేయని యెప్పుడును జాటు నెల్లెడలంగా, నీయేడుసు బాటిం పమిఁ, బాయునిరోనమునఁ గలఁతవడు వాయసుఁడున్. 27 క॥ ఈయున్న తటిని

క॥ మంతనపు సంగతుల నలు,సంతయుఁ దూచాలు తప్ప కంతయు నేను
స్వాంతుం డెఱుంగు నాథగ, వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్
క॥ ఎంతో నీచ మగు తటా,కాంతరమున నేస్గపాద మల్లనఁ గొనుదు
శ్చింతము మొసలి నెఱుఁగుభగ, వంతుండున్నయెడఁ దెలియవలయున్నిజముల్

---

గండుం, గోయిల కాకమున నుంగుఁగొంగం గని యెం,దో యొత్తిలిన గెనఁట, యది,యేయొక రంధ్రముగ విగ్రహింపఁగఁదొడఁగెన్. 28 ఉ॥ కోకిలమట్లు కయ్యమునకు న్మది గొల్పదు ముద్దులొలుకఁగా,వాకొనియెల్లలోకులను వశ్యులఁ జేసిన దయ్యునెప్పుడో,కాకము నొద్దనొక్కపరి గానము నేర్వఁగఁ బోయియుండుటన్, గాకికిఁ గోకిలమ్మునకుఁ గయ్యము తియ్యము గాక యుండుటన్. 29 క॥ అదికారణమ్ముగాఁ ద,న్నెదురఁగలే దని తలంచెనే మో? కాకం,బాదిగ పికపూజితమ్ముల,వెదకివెదకి చూపసాగె వెత్తిదొనంగుల్. 30 చ॥ ఎఱుఁగదుగాక కాక మొకయించుకయేనియు నాత్మశక్తి; వా,దెఱవ నపస్వరంబులుగ దే? తనకుం బొడసూపు! గాయకో, త్తరకలకంఠనాదమునఁ దానును దప్పులు వట్టఁజూచినన్,గరుసగు నే వికస్వర పికస్వరమెవ్వరికేని యంతలోన్. 31 క॥ కాక మొకవక్త్ర కోయిల, మూకంబని మదిఁ దలంచు మొఱకులఁ దెలుపన్,లోకోత్తర మగుఫణితిని, కోకోయని కూయసాగెఁ గోకిలమంతన్. 32 ఉ॥ చేసెడుచేఁత యుత్తములచిత్తమును త్తలపెట్టుచుండుటం, గూసెడుకూఁత కర్ణములకుం బరుసంబుగఁ దాఁకుచుండుటన్ వాసియు వన్నెయుం గలుగువారలు "హుం"షపిపాఱఁదోలినన్, నాసరివారు లేరనియె నమ్మను వాయసుఁ డేమిసెప్పదున్. 33 క॥ కొంగొంగురనుచుఁ గూసెడు, కొంగను ముంగిళ్ల మెలఁగు కొంచెపుఁగాకిన్,బంగారు పంజరమ్మున సింగారింపఁగ నెవఁడు చిత్తముఁ గొలుపున్ 34

(కోకిల కాకము)

తెలిసిన తాను గానమును దెల్పన దేయగుభోఁ,
గొలువకయున్న దోసమది కోయిలపిల్లదె కా,
తలఁపఁగ రానికూఁతలను దత్త్వమెఱుంగక కో,
కిలమును దూఱి వాయసము కీర్తిఁ జెందునుకో? 35

శ్రీపీఠికాపుర సంస్థానవిద్వాంసులు, వేంకటరామకృష్ణకవులు.

క॥ ఇంతి ద్రుపదాత్మజాత స్వాంతరమున దుస్ససేనునవమానంబుం
గంతులకుఁ బాఁపఁగల భగవంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క॥ భ్రాంతిన్ బ్రాజదుపులుద, న్వంతుని లో డాఁచుదాంగవాని నసురదు,
శ్చింతుని గనుఁగొను నాభగ, వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క॥ ఇంతి జగన్మోహిని దా, సంతర్పణఁ జేయ సురలనందున నరియ
ల్లంత నిలుకు లెఁ ఒలఁగిన భగ, వంతుండున్నయెడఁ దెలియవలయున్నిజముల్

క॥ నఁటమనములోన నుద, న్వంతునిలో నుండుకొండ ప్రక్క జరుగు వ్య
త్తాం తమ్ము నెఱుఁగు నాభగ, వంతుండున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క॥ ఓయీ తిరుపతి శాస్త్రీ?, నాయీ శిష్యుండు కాకి నామము నాకున్
వేయాఱు లిచ్చుటకు బదు, లా యుర్భాగ్యములు గోరి యర్పణఁ జేసెన్. ౧౨

ఉ॥ ఏనును నీవు నిక్కపుఁ గవీంద్రులమే యగు టొప్పనేని దు
ర్మాని మదీయశిష్యునపరాధ మ దెంతటి దైన నేమి య
జ్ఞానకృతంబుగాఁ దలఁచి కాచి నిను న్నను నద్యశేశ్వరా
ధీనులఁ జేయుఁగాతఁ బరదేవత శిష్యుఁ జిరాయుఁ జేయుచున్. ౧౩

మ॥ మనలన్ దిట్టినఁదిట్టుఁ గాక తగ నస్మచ్ఛిష్యుఁడౌ నీతనిన్
ధనధాన్యాదిక మాయువున్ సిరియు విద్యాబుద్ధులన్ గూర్చి వృ
ద్ధిని నందించెడిఁ గాత మాత గురుభక్తిన్ వచ్చుజన్మానకే
ననుసంధించుతఁ గీర్తియుంగలుగుఁ గా కానాఁడె యవ్వారికిన్. ౧౪

మ॥ కలుగున్ గావుత సూర్యరాడ్విభునకున్ గళ్యాణపారంపరల్
దెలియుం గావుత మేరికన్నఁ గవులే దేవాంశసంభూతు లం
చిల నీక్రేఁ డొనరించు పుణ్యములె మాయీశిష్యదుర్దోషమున్
గలికాలంపుఁ బ్రివర్తనం బుడిపి పైఁ గాపాడి రక్షించుతన్ ౧౫

సీ॥ మొదలంట నడఁగంటి మూలమూలలనుండు వేదశాస్త్రమ్ములు వెలికి వచ్చె
మనకు దిక్కెవ్వరో యని కుందు నాంధ్రకవులకవిత్వము నేఁడు వెలికి వచ్చె
నెంతకు సృష్టించె నీమమ్మ నని బిట్టువందురునన దలవంత లడఁగె
నెట్టులని ల్చెడినొకో? యీ పాఠశాల లిమ్ముల నన్నశాల లుజ్జ్వలత కెక్కె

తే॥ గీ॥ నెవని కతమున నట్టిమనీషిపాద, రేణుపావితనత్ప్రభాశ్రీవిశాఖుఁ
డార్యసూర్య రాయేంద్రుననఘసుకృత, మగుసుగాక మాశిష్యుని కంగరక్ష.

క॥ ఇఁక నీయవస్థవినుమా!, ఒకనాఁటిది నీవు నిన్నుఁ బకవక నెవుడో
పికపోతము పొగరున నెం, దుకొ నవ్వినదంట! యొఱుఁగుదువె యదినఖుఁడా.

క॥ అదియే కారణ మఁట? నీ, మది గలఁగుట కక్కటా! తము సమచ్చరమునఁ ద
మ్మొదిరింప రండటంచుక్, గదనమునకుఁ బిల్చె నఁట! కంటివెయిదియుక్.

క॥ ఎదిరించెడి నేర్పది యు, న్నది యఁట! చదువబ్బకున్న నదియే పోయెక్
గదనము గురుతోఁ జేయఁ ద, గదు పొమ్మని మానెనంట! కంటివెసఖుఁడా!.

క॥ ఎంతటి తెల్వియొ చూడుమ!, యంతే వానిత్వమాతఁ డంతో యింతో
యొంతో నా కొనరించెను, జింతింపఁగ నేల నిన్నుఁ జెనఁకుట కనఘా. ౩౦

క॥ గాంగేయు నెఱుఁగఁడో? పా, ర్థుం గనఁడో? భారతమున; దొంగప్రసంగం
బుం గనలేరే లోకులు, "మంగలి మాధ్యస్థ్య" మనుచు మది నెంచెనుకో!.

క॥ నందియ మందెను సరియే, వందవలెక్ వదరుపట్ల భయ మది లేదో!
యొందుల కీవ్యాస మ్మది, పందతనము తెలుప దొకొ? బాలున కేనిక్. ౩౨

క॥ భారతమున నున్నదొ యిది, గీరతమునయందుఁ గలదొ కేవలముగ ని
చ్చోరతి వ్రాసిన దేకద!, మోఱకు లనరొకొ? వినిన బుధవరులెల్లక్. ౩౩

క॥ అన్యాపదేశ మన ని, ట్లన్యాయపు వ్రాఁత యగునె యకటా? విద్యా
శూన్యులకుఁ దెల్వి, ధీర,మ్మన్యులకుక్ మంచి చెడ్డ మహిలోఁ గలదే. ౩౪

క॥ ఎవఁ డేడ్వఁ దన్ను, శిష్యుఁడ "నవుదును నే.,నని వచింపు మని లేదని బొం
కు విధము దీనికి నెంతో, నవిశేషము గాక యున్నె జడుఁ డెఱుఁగు నెటుల్

చ॥ "చదివితి నిక్క మే గురుఁడు చప్పనికూఁతలు నెప్పినాఁడు నే
నదివఱకే కళావిదుఁడ" నంచు వచించి వికత్వ మూని దు
ర్మదమునఁ గాకిగా గురుని వాటికిఁ జెప్పటకేన్ని నువ్వదే
"చదువనె లే"దటన్న నిది సత్య మటంచుఁ దలంచెనో కదే. ౩౬

ఆ॥ వె॥ కల్ల కాటినత్య మిల్లు నట్టేటిలోఁ, గట్టి కొన్న వగిదిఁ గానఁబడెడి
నెల్లవాను నగరె "యిహిహి" దురాగతం, బనరె యెరు చెప్పి రకట! యిట్లు!

ఉ॥ కొంగక నిన్నుఁ బేర్కొనిరి, కోరినవాఁడవు నీవు వారితో
సంగర, మందులోఁ జూతఁగఁ జాలమికిన్, "బికమేడ: గాకితో
సంగర, మేడ నంచుఁ బెలుచన్ లిఖియించిరి హేతు,వింతలోఁ
గొంగవు కాకి వెట్లయితో? గొంగ యనంగను శత్రు వందురో. ౩౭

క॥ అటుమీఁద శత్రువునకున్, దటకావడి మూలఁబడుట తథ్యము కాదే!
యెటు వ్రాసి కొన్న నేమి కపట మెఱుఁగం బడదె జగము పాషాణంబే. ౩౮

గీ॥ దోమ యేనుఁగుకడ కేగె దొరకువఱకు,రక్తమునుగోరిలునిచ్చ, భద్రగజరాజు
నొడలు తనపాలుచేసె నీవెడఁగుదోమ, పాడుతుండంబునకు లేదు పాటవంబు.

క॥ నాకును దుండంబున్నది, నేకపరాజునకుఁ గలద యిది యని యాపై
డీకొని పోరఁగఁ జొచ్చిన, నా కదనం బెట్టులుండు నరయుము సఖుఁడా!

---

## (2) సూర్యరాయపర్వము



సీ॥ ఆకొండివారింట నాకంఠముగ మెక్కి సత్రంబు చెప్పినజాణ తనము
మధునవంతులసూగబుధు దేశికత్వమ్ము మున్ను చెప్పినరీతి సున్న యిడుట
అటుమీఁదఁ దాఁ బికంబైనన్నుఁగాకంబుగా వ్యాసములువ్రాయుగాణతనము
ఆవ్యాసములుగూడ నట నిట గోమయోదకసేచనము గోరు వెకలితనము.

తే॥ గీ॥ గాంచి యేమి "దశరాగతం,బంచు నడుగు
వాఁ డొకఁడు లేఁడు గా! యని వగచుచుండ
దొరకె నొకఁడు నూజివీట్పురమునందు
దొర రసజ్ఞుండు సత్కవిచరణ్యరతుఁడు. ౪౧

క॥ విరవ యను నూరుకాపుర, మరసినవాఁడతడు సకల మగుకావ్యములున్
సరిగారు వెలమలన్ ధీ, వరు లతని కటన్న జడుల వాకొన నేలా. ౪౨

క॥ ఎఱుఁగవె! సంస్కృతభారత, వరమార్గజ్ఞుండు రావు వంగడమున నీ
వరిసరమునఁ గలదొరలకు, శిరోవిభూషణము సుగుణసింధుం డెందున్. ౪౩

తే॥ గీ॥ నెవని కతమున నట్టిమనీషిపాద, రేణుపావితసత్ప్రభాశ్రీవిశాలుఁ
డార్యసూర్యరాయేంద్రుననర్ఘసుకృత, మగునుగాక యాశిష్యుని కంగరక్ష.

క॥ ఇఁక నీయవస్థవినుమా!, బకసైతివి నీవు; నిన్నుఁ బకపక నెపుడో
పికపోతము పొగడున నెం, దుకొ నవ్వనదంట! యెఱుఁగుదువె యదిసఖుఁడా.

క॥ అదియే కారణ మఁట? నీ, మది గలఁగుట కక్రూతము సమచ్చరమునఁ ద
మ్మ్రదిరింప రండటంచున్, గదనమునకుఁ బిల్చి తఁట! కంటివెయిదియున్.

క॥ ఎదిరించెడి నేర్పది యు, న్నది యఁట! చదు వబ్బకున్న నదియే పోయెన్
గదనము గురుతోఁ జేయఁ ద,గదు పొమ్మ్రని మానెనఁట! కంటివెసఖుఁడా!.

క॥ ఎంతటి తెల్వియొ చూడుమ!, యంతే వానిత్వ మాతఁ డంతో యింతో
యొంతో నా కొనరించెను, జింతింపఁగ నేల నిన్నుఁ జెనఁకుట కనఘా. 30

క॥ గాంగేయు నెఱుఁగఁడో? పా, ర్థుం గనఁడో? భారతమున; దొంగప్రసంగం
బుం గనలేరే లోకులు, "మంగలి మాధ్యస్థ్య" మనుచు మది నెంచెనొకో!.

క॥ నందియ మందెను నరియే, పందవలెన్ వదరుపట్ల భయ మది లేదో!
యొందుల కీవ్యాస మ్మిది, పందతనము తెలుప దాక్రూ బాలునకేనిన్. 32

క॥ భారతమున నున్నదా యిది, గీరతమునయందుఁ గలదా కేవలముగ ని
చ్చారతి వ్రాసినదేకద!, మోఱకు లనరొక్రూ? వినిన బుధవరులెల్లన్. 33

క॥ అన్యాయదేశ మన ని, ట్లన్యాయపు వ్రాఁత యగునె యకటా? విద్యా
శూన్యులకుఁ దెల్వి, ధీర,మ్మన్యులకున్ మంచి చెడ్డ మహిలోఁ గలదే. 34

క॥ ఎవఁ డేడ్చెఁ దన్ను, శిష్యుఁడ "నవుదును నే.,నని వచింపు మని లేదని బొం
కు విధము దీనికి నెంతో, నవిశేషము గాక యున్నె జదుఁ దెఱుఁగు నెటుల్

చ॥ "చదివితి నిక్రూమే గురుఁడు చప్పనికూఁతలు నెప్పినాఁడు నే
నదివఱకే కళావిదుఁడ" నంచు వచించి పికత్వ మూని దు
ర్మదమునఁ గాకిగా గురుని వాటికిఁ జెప్పటకన్న నిప్పుదే
"చదువనె లే"దటన్న నిది సత్య మటంచుఁ దలంచెనో కదే. 36

ఆ॥ వె॥ వల్లకాటిసత్య మిల్లు నట్టేటిలోఁ, గట్టి కొన్న పగిదిఁ గానఁబడెడి
నెల్లవారు నగరె "యిహిహి" దురాగతం, బనరె యేరు చెప్పి రకట! యిట్లు!

ఉ॥ కొంగక నిన్నుఁ బేర్కొనిరి, కోరినవాఁడవు నీవు వారితో
సంగర, మందులోఁ జూడఁగఁ జాలమికిన్, "బికమేడః గాకితో
సంగర, మేడ నంచుఁ బెలుచన్ లిఖియించిరి హేతు,వింతలోఁ
గొంగవు కాకి వెట్లయితొ? గొంగ యనంగను శత్రు వందురో. ౩౮

క॥ అటుమీఁద శత్రువునకున్, దటకావడి మూలఁబడుట తథ్యముకాదే!
యొటు వ్రాసి కొన్ననేమి క,పట మెఱుఁగం బడదె జగము పాషాణంబే. ౩౯

గీ॥ దోమ యేనుఁగుకడ కేగి దొరకుపలుకు,రక్తమునుగ్రోలునిచ్చ, భద్రగజరాజు
నొడలు తనపాలుచేసె నీవెడఁగుదోమ, పాడుతుండంబునకు లేదు పాటవంబు.

క॥ నాకును దుండంబున్నది, నేకపరాజునకుఁ గలద యిది యని యాపై
డీకొని పోరఁగఁ జొచ్చిన, నా కదనం బెట్టులుండు నరయుము సఖుఁడా!

## (2) సూర్యరాయపర్వము.



సీ॥ ఆకొండివారింట నాకంఠముగ మెక్కి సత్రంబు చెప్పినజాణతనము
మధునవంతులసూగబుధు దేశికత్వమ్ము మున్ను చెప్పినరీతి నున్న యిడుట
అటుమీఁదఁ దాఁ బికంబైనన్నుఁ గాకంబుగా వ్యాసములువ్రాయుగాణతనము
ఆవ్యాసములుగూడ నట నిట గోమమోవకసేచనము గోరు వెకలితనము.

తే॥ గీ॥ గాంచి యేమి "దురాగతం,బంచు నడుగు
వాఁ డొకఁడు లేఁడు గా! యని వగచుచుండ
దొరకె నొకఁడు సూజివీట్పురమునందు
దొర రసజ్ఞుండు సత్కవిచరణ్య రతుఁడు. ౪౧

క॥ విరవ యను సూరుకాపుర, మరసినఘాఁడతడు సకల మగుకావ్యములున్
సరిగారు వెలమలన్ ధీ, పరు లతని కటన్న జదుల వాకొన నేలా. ౪౨

క॥ ఎఱుఁగవె! సంస్కృతభారత, పరమార్థజ్ఞుండు రావు వంగడమున నీ
పరిసరమునఁ గలదొరలకు, శిరోవిభూషణము సుగుణసింధుం డెందున్. ౪౩

ఉ॥ వేంకటసూర్యరాట్సుకవివర్య విదుం డగు రామచంద్రనా
మాంకుని స్వాలయంబునకు ధనమం దెటు లైనను బిఠాపురీ
శంకర బాంధవుం డనఁగ శాస్త్రవిదుండగు ధర్మమూర్తికిన్
వేంకటసూర్యరాయనికి విందు వివేకి యథార్థవాదియున్. ౪౪

క॥ అతం డదిగెదననె వినఁగ, బాహులకంబాంగములను బాగరుణా జగలున్
బాహురికిఁ దమ్ముఁ గోఁతఱు, మూఁతంబడు నమ్మఁ దతఁడు బాంకుంకూఁతల్.

క॥ దాసన్ బాధం బేమన్ని, యానీ నీకడిగెదత్రు! వారి శాస్త్రైకన్
జ్ఞానంబు గలుగు ననియున్, శానగాయుకమబ్బు ననియుఁ దలఁచెద సఖుఁడా.

---

పిఠాపురం.

శ్రీరామ ది 16-1-11

మహారాజశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి, శిష్యుడు రాజా వెంకటసూర్యారావు కృతానేక వందనములు......... నేను ఇక్కడకు వచ్చి నాలుగురోజులు అయ్యింది. అది మొదలు ఇక్కడివరకున్నూ- అత్యద్భుత శతావధానుల దర్శనం చాలామని ఎంతయత్నించినన్నూ నాకు సందర్శించక పోయినందున్ను రెండుసార్లు వారిబసకే వెళ్లినన్నూ- సమావేశం కాలేదు- కారణం నేను వ్రాయచాలను. ఇంతమా అట్టిలాభంనాకు ప్రాప్తించినది కాదు అనిఅనుకున్నాను......ప్రస్తుతం చాలా పశ్చాత్తాపం లోకి వచ్చినట్లు నాఅశ్రులవల్ల రూఢిగానిన్నాను- నేనువకసారి సమావేశమయ్యేనో ఎంతఅంతముగా సైనాయుండును. గాని మీబుద్ధదికాదు- ఒకసారి సమావేశమయ్యే యెడల మీకు నేను శిష్యుడనైనందుకు గురుదక్షిణ చెల్లించుకొనిన వాడను అగుదును. అతని సమయంలో నెరవేర్పలేనందున్న నేనున్నూ వారివలె గుర్వభిమయంలో కృతఘ్నుడనే కావలసివచ్చినది. ... ... నాఅదృష్టము ఉన్నా నేనున్నూ కూడా మీగిరతముసే త్వరలో పదివి అనుభవించు కుతూహలంతో నున్నాను, గిరతంయొక్క పూర్వోత్తరం పిఠాపురంలో వున్న పండితులు అందరికిన్ని పద్యములు నోటికి రాకపోయినా సంగతి యావత్తున్నూ చెప్పినాను అటువంటి గ్రంథం బయలుదేరితే లోకమునకు ఉపకారమవుతుంది అనిఅన్నారు. అంతా...... వేస్తూన్నారట...... రా॥ వెం॥

సీ॥ నాయొడఁ దాఁ గృతఘ్నత్వనామకమహాపాతకి యౌట విస్పష్టమంట!
ఈపాతకమ్మున కేర్పడ్డశిక్షఁ దాఁ బరమందుఁ గనుట తప్పనిదె యంట
అంతియే కాని నాకాతఁడు శుష్కఁ దం చని నేను జెప్పు టనర్హమంట!
సైదానఁ దనకీర్తిఁ బలించునే కాని నాకు యశంబుగున్న యగునంట!
తే॥ గీ॥ శౌర! యెటువంటివేదాంత మభ్యసించె?
"నేమి శాశ్వత మాగోడ యుంచుకొంత
యవల జరిగించి పెట్టెదం, దని వచించు
వెఱ్ఱివేదాంతితన మిట "బట్టు,, మనియె.॥ ౫౫

## (౩) సంబుద్ధిపర్వము

క॥ "మావాఁ డతిదుర్మార్గుఁడు, మీ వానిశిరమ్మునందు మేకులు గొట్టం,
దేవేశ! యేమి సేయుదు, కావలమున నన్న నీతిగనఁ జేసెదవా! ౫౬
ఉ॥ వేంకటరామశాస్త్రి! విను విద్య పఠించితి నంచు నెవ్వరో
జంకియుఁ గోకిలమ్మ వయి చక్రగ స్పష్టము గాఁగ నెంతయో
పెంకెతనంబుఁ జూపియును "చెప్పెపెపెప్పె" యంచు నేఁడు ని
శ్శంకగ నొప్పికొంటి వది చాలు జయం బగుఁగాక నీకికన్. ౫౭
ఉ॥ "కాక" పటించఁ దిట్టుదువు గాక శ్వపాకుఁడ వందుగాక యిం
కేకలువంపుపేరు లిఖియింతువు గాక స్వకార్యసిద్ధి నేఁ
జేకొనినాఁడ నేఁడుగద! చేకుర మోదము; నీవు తిట్ట లే
దీకవి నీతఁడే యు రక యిట్టులు తిట్టుకొనెన్ గుమారకా. ౫౮
ఉ॥ "దప్పనికూఁతలే" యనుము ఛాత్రుఁడవై గద! నన్ భజించుచున్
జెప్పినఁ జెప్పికొంటివి ప్రసిద్ధుఁడ నవ్వటి కయ్య నీవు నీ
చెప్పుడు గానినాదరిని శిష్యుఁడ వైతివి తండ్రి! నీమనం
బొప్పెనె యిట్టితిట్టుల కహో? యటు కృష్ణుఁడు వ్రాసిపెట్టెనే. ౫౯
చ॥ మొదట "రిజిస్టరుత్తరము" మాటువనం బగు పట్టమందు నేఁ
దగ లిఖియించి తిర్పతిని గయ్యము కై పురికొల్పినాఁడ నీ-

వది గని యెంతగా బెదరి తయ్యెయొ? పాతకినైతిఁ దండ్రి! నా
యదయత నైఁపుమయ్య! యిఁకనైనను భీతిని మాను మర్భకా.॥ ౬౦

చ॥ తిరుపతిసింహా మొక్క మొగిఁ దీవ్రతరంబుగ వచ్చి పీఠికా
పురమున నున్న నాపయి "గుభుక్కున" దూఁకు నటంచు నెంతకా
తరపడినాఁడవో యకట! తండ్రి! కృతఘ్నత కాదు హేతు; వీ
శ్వర, యను వేరునుష్ట్ర సినుజంకఁగఁ జేసిన దేమి సేయుదున్.॥ ౬౧

శా॥ నీయజ్ఞానము నీకులోభగుణమున్ నీదౌకృతఘ్నత్వమున్
నీయల్పజ్ఞతఁ జేసి గాక యకటా? నీమీఁది కే మంచు యీ
గ్రాయత్తుం డయి రాఁగడంగు నొకఁ, డే నవ్వానిఁ బ్రాణాలతో
డాయ న్నిత్తునె? నన్ను వీడిగద! కట్టా! చెట్ట వైతింతకున్. ॥ ౬౨

చ॥ తిరుపతిసింహమున్ సరిగఁ ద్రిప్పి ప్రశాంత మొనర్చ వేంకటే
శ్వరునకుఁ దక్క నీయనుఁగుబావకు గీవకు నోజ గూర్చు నీ
గురునకుఁ జర్లసంగ్రునకుఁ గూడ శకం బెటు లన్యుడిన్ దుర
ధర మది, నేను దానిబలుధాటికి నొక్కక వేళ జంకెదన్. ౬౩

ఉ॥ కాఁకరపర్తిపై కుటుకఁగా గమకించె నెయుంగుదే? "శత
ఘ్ని" కృతి సాహ్యకర్తలును నీవును బావయుఁ బోలె "శృంగభం,,
గాకలనప్రసంగ మది యజ్ఞతమై లిఖియించినట్లె వా
పోకయ పోయినట్టులుగఁ బూర్తిగ డేఁకిరి జ్ఞప్తి యున్నదే. ౬౪

ఉ॥ వెంకన బంధు వొకతన వేఁకుఱ్ఱవాఁత లోకింత నైఁచు మీ
గ్జంకుటగాఁ దలంచి పెలుచన్ గుఱుపల్ లిఖియించుచుండ్రు మీ
పెంకెతనాలు సాగ వల బెబ్బులిపై; వెలినాఁటి సింగ మి
ట్రింకుల నింకఁ జేయు నెపుడేనియు; డొంకలె నూ? శరణ్యముల్ ౬౫

ఉ॥ ఏది? సదుత్తరం బతని యేత్తెఱ్ఱవాఁతకుఁ జెప్పుమా? శర
శ్ఛదము కాదె వంటె మిడె సిగ్గు గలట్టి నృజన్ముఁ డేని *"మీ
రే దెనకేని బొం"డనుచు నీయఁగఁ జేయునె యుత్తరంబు దా
యాదుని పేరు పెట్టి; యవురా? యివి రాని చవి రానిబీరముల్ ౬౬

*గీరతము, 1 భాగము శాఖాచంక్రమణపర్వము ౭౬వ పుట ౨వ పంక్తి చూ.

ఉ॥ "పొండల పీఠికాపురికిఁ బొండటుపొం," దని నీదువావదా
వాండ్రొకలేఖ వ్రాసె నది యారఁగ నయ్యెడ కేగుదేర న
వ్వాండ్రొకొ కోఁడు "మీ రిటకు వచ్చితి రేటి," కటంచు, నెందుకే
గండరసంపుఁ బ్రాంతలు జగంబు యుగంబుల నవ్వచేటు సూ. ౬౭

చ॥ "పిలిచినయట్టి రాక యటు * పెట్టిగ నుత్తర మిచ్చె నెవ్వరో
చలపతి 'పీఠికాపురముచక్రికిఁ బొ'మ్మనినట్టి లెవ్వరో
తెలిసిన వచ్చువాఁడవె? నగించెడి నీకు ప్రసక్తి," యంచు న
వ్వల నల కోఁడు నవ్వలరఁ బల్కిన నుత్తరమేది పుత్రకా. ౬౮

---

* శ్రీపీఠాపురీ రాజపుత్రోదయ విషయిక, పద్యత్రయము.

సీ॥ ఉదయించె రాజా రావాదవ్వరూపనన్ద దభివర్ధనుండు సూర్యాంశజ లన, జన్మించె సంతానశాఖి నందనతుల్య శ్రీ పెంపుమీఱఁ బీఠాపురమున, వెడలెఁ దన్మానసంభవుఁడు సూర్యనందు నారాయణాంశంబున్నదంచుఁ దెలుపఁ, బొడమె నాండాలమ్మ కడుపు చల్లఁగ రాజసన్యంబు సజ్జన స్తామ మడఁప॥ గీ॥ మంగమాంబ గతించిన మాననీయ, సుకృతపరిపాక మెల్ల నేఁటికి లభించెఁ; గఁటికగతడె రావుగంగాధరోత్స, వదుఁడు రామావనీపాలవరుఁడు మరల॥ గీ॥ తనిపె సాధారణం బసాధారణముగ, మఱియు నఁదుసు నాశ్వయుజ్మ సబహుళ, నక్షమఁ దృతీయయును శుక్రవాసరంబు, మకరలగ్నంబు సూర్యసంభవుని వలన॥ మ॥ గురుడు న్సూర్యుఁడుఁ జంద్రుఁడు స్వగృహుఁడు శుక్రుండు స్వోచ్చుండు న్నవై, శ్చరుఁడుం గేతువు రాహువుం గలసి యుత్క్రాంతంబు సీమాలునిన్, నిరిదీర్ఘాయు వొసంగి ప్రోతురు బుధాశీర్వాదముల్ తోడుగా, నరవిందాక్షుకటాక్ష వహాయి బలి సూర్యారాయ భూపాలకా.

25-10-10 } కాకినాడ }

దివాకర్ల తిరుపతిశాస్త్రి,
శతావధాని.

శ్రీరాజా [illegible] రామచంద్రవెంకట
కృష్ణారావుబహద్దరుగారియాస్థాన విద్వత్కవి.

---

True copy of letter from the Private Secretary to the Rajah Pithapuram dated 29th October 10, addressed to

క॥ అతఁడేల చెప్పవలెఁ? సం, స్కృతనిశ్శేషావదాతధృతనిద్రాసం
గతిగతకాఁకరవర్తి, స్థితసుశ్రుతనేత్రి మడుఁగఁ జెప్ప నఖిలమున్. ౨౨

ఉ॥ అట్టిఁడతండు కావున నె యాతనిఁ బ్రావల్ గలయుత్తరమ్ము మా
పట్టుననుండె సం చెఱిఁగి బావ "యతం *డది వ్రాయలే,, దటం
చొట్టులు సత్యముల్ గిలికి యుత్పథచారిగ దూఁక జొచ్చె "వీఁ'
డిట్టిఁడు బొంకి యాత్మ కెటులేని యశం బొడఁగూర్చు,, నం చొగిన్ ౨౩

క॥ త్యాదృశులు దక్క మీఁదు, ర్వాదములకుఁ దోడు 'సూప రా రతఁడేనిన్,
బాదాక్రాంతత కొడఁబడి, నీదగు నఘ మడఁచెఁ గొంతనీతి గలాఁడే ౨౪

చ॥ కలతెలుఁగున్ లిఖించె నలకాతరుఁ డక్కటా? పేరు పెట్టి ;య
వ్వలఁ నెవరో లిఖించు నలపత్రము తన్ను ఘటించి తిర్పతి
జ్వలనము చుట్టుముట్టు నని సంధియ మందఁగఁ బోలుఁ బాపి పే
కొలఁదియుఁ గానిత న్నెదురుకొన్న జగంబు మఱింత నవ్వదే. ౨౫

క॥ తిరుపతి ధోరణి తెలిసెనె, "శర"ణని నీబావకై యశస్కరుఁ దత్సో
దరి నిడిన బావమఱఁదినిఁ, బొరిఁబొరిఁ బలికించి కాచి ప్రోచెన్ గరుణన్. ౨౬

చ॥ అతఁడు కృతజ్ఞుఁ డౌటఁ జుమి యాత్మకు వెంకననాము వీనినీ
చతరపికాభివర్థనుని సద్గురుఁగా లిఖియించె దానిచే
నితనికి వాఁడు తక్కు వని యెంచుచుఁ దిట్టితి వెంత చేలవో?
కృతమును జూపునంతటనె కేవలనీచుఁ డెవండు గాఁడు సూ. ౨౭

(నవంబరు 24వ తేది 1911 సం॥ కృష్ణాపత్రికనుండి.)

*తి॥ శా॥ గారు శృంగభంగ గ్రంథకర్తకు రిజష్టరు జాబు వ్రాయుటచేఁగాని యాతఁడు వ్రాసినట్లు యథార్థవాది యభినవ సరస్వతీపత్రికలోఁ బ్రకటించిన యుత్తరము చేఁగాని ప్రయోజనము లేదు. ఆయుత్తరము సత్యాసత్యములుసమయము వచ్చినప్పుడు తేలకపోవు....

సీ॥ భవుసిన్ భావపదారవిందభవుఁ జెల్వ ప్పిళ్ళవంగార్ణవో!, ధ్భవునిన్ శా ౧
స్త్రవదంవదానహాభవున్ భాస్వద్గవున్ సాహితీ, ధవునిన్ మేఘగభీరవిస్ఫుట

ఉ॥ కృతమును జూపకుండునరుఁ డేమగునో! యిపుడేని స్పష్టమై
మతి నతికెంగదా! సకలమర్మ మెఱింగియుఁ దత్తఱంబునన్
మతి చెడి "కాక,, మంచి నొకమాటను గల్పనఁ జేసి నన్నుఁ ది
ట్టితి వది యేమి కార్యము! గడింది యశమ్ము గడించు ట్లోవయే. ౭౮

చ॥ "తిరుపతి నాపయిన్ గవినెఁ దీవ్రత మద్గురు వైనవేంకటే
శ్వరునిక తానఁగాదె, యని శాంతి యెఱింగిన నీవు తద్గుణ
స్ఫురణము చూపి యుత్తరము సూటిగ వ్రాయక యేటికయ్య! యా
చరితపు వ్రాఁత; కృష్ణుఁ డెటు దోఁపఁగఁ జేసెఁ గుమార! చెప్పుమీ. ౭౯

క॥ చరులకు శాంతిం గఱపెడి, వరమోత్తమ గురుఁడ వీవు బాలక! నీకున్
గఱపఁగ నేఁ జాలుదునే, దురితపుఁగాకి నని నీకుఁ దోఁచిన దెకదా! ౮౦

చ॥ "గురు" వని చెప్ప నందులకుఁ గోప మిదేమిటికీపనుల్ యశ
స్కర మగునే?,, యటంటి వది నమ్మతమే! కొమరుల్ గలారు నీ
కరయఁగ వర్ధమాను లిటు లాచిరజీవులు నిన్ను నల్పన
స్తరుణమునందు నీహృదయతాప మదెట్టిది యౌను తెల్పుమీ. ౮౧

క॥ గురునకుఁ* దండ్రికి భేదం, బరయంగా లేదు శిష్యుఁడనఁ? గొమరుండే
యెఱిఁగిన వారికి; వాఁడే, తిరస్కృతిన్ జూప మదికిఁ దెగులు గలుగదే. ౮౨

---

రచున్ ధైర్యప్రభా మేరువున్, గవితానద్గురు వేంకయాభిధుని వక్కాణింతు నై
కాలమున్ (ఇది తి॥శా॥ గారి మొదటికవిత్వము కుమారసంభవములోనిది.)

"సీ॥ తనకు వేంకటశాస్త్రి తగిన సహాధ్యాయిగాఁ బాణినీయాబ్ధి కడచి రెండు, భాషలలోఁ దత్క్రియన్ గవి యయ్యు ననేకముల్ శతలేఖినీకవిత్వ, తంత్రముల్ పెక్కుగ్రంథమ్ము లాతనిసహాయమునఁ గావించి యయ్యనఘుఁ గూడి, శ్రీపోలవరపురీభూపాలుఁ డాంగ్లేయ భాషాప్రవీణుండు బహుకళాఢ్యు". తే॥గీ॥ గంధ రుఁడతిశాంతుండు సరసుఁడును నగు, రామచంద్ర వేంకటకృష్ణరాయచంద్రు, నొద్ద బుధుఁడును గవియుమాన్యుండునై చె, లంగు తిరుపతిశాస్త్రి తెలుంగుఁ జేసె.

(బాలరామాయణ నాటకప్రథమాంకముచూ)

(ప్రస్తావికాభియుక్తోక్తులనుండి.)

*శ్లో॥ దశవిప్రసమో బంధు ర్దశబంధు స్సగోత్రజః, దశగోత్రసమో జ్ఞాతి ర్ద

క॥ ఇదిగాక నీవు చుట్టమ, వదియు విచారింపఁ బుత్రతాపాదకమే
గద! *“మా” ఇచ్చి వ్రాసిన నీ, పదముల మగులేఖ కలదు చదువుము దానిన్.

క॥ నీజనకు నాయనమ్మయు, నాజనకునితల్లి యొక్క నాయనకును సుం
డే జననికి జన్మించిన, రాజ నెఱుంగుదువా? మఱచితివా? గురునిబలెన్. ౮౪

ఉ॥ ఏ నలచర్లబ్రహ్మయమనీషియెడన్ గదుభక్తియున్ గృతం
బూనినవాఁడ నంచెఱుఁగు రాగ్యుఁడ వీ వది నమ్మ దేని నా
మానసమందు నున్నయిది మాత్రము నమ్మక పోవు కాన నీ
శానుని సాక్షిగా వినుము సర్వము దెల్పెద నారహస్యమున్. ౮౫

ఉ॥ ఏ నలపీఠికాపురనరేంద్రుని చెంతను జేరి తన్మహా
స్థానమునందు నుండుటకుఁ బద్ధయుఁ గోరినవాఁడ నౌచు నీ
పైని నసూయఁ గొంటి నని పల్కుట దెల్పితి వీవు వ్రాఁతలో
నీనుడి నిక్కమే యగునె? నీవు నెఱుంగుము నాదుభావమున్. ౮౬

ఉ॥ ఎందఱు రాజు లుండిరి! యహీనులు నాయెడఁ బేర్మి భక్తియున్
విందుతనంబు గల్గినవివేకులు; వారలయొద్ద నుంటినే!
గందరగోళమైనమది గల్గినవాఁడ స్వతంత్రుఁడన్ జిదా
నందుఁడ నే శ్రీసుకాసుకని నాయకుఁగా వరియించి యుందునే. ౮౭

---

శజ్ఞాతివమో ఽనుజః, దశానుజసమా మాతా, దశమాతృసమః పితా, దశానాంచ పితౄణాంచ సద్గురు ర్జ్ఞానదోఽధికః, ... తస్మాత్సర్వ ప్రియత్నేన సదా సంపూజయేద్గురుం,,

పల్లిపాలెం

*బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రులబాబుగారి సముఖమునకు, ఓలేటి వెంకట్రామయ్య నమస్కారములు చేసి వ్రాయుశుభలేఖార్థములు ... శుభముహూర్తమునకు సకుటుంబపరివారముగా దయచేయగలందులకు ప్రార్థించుచున్నాడను... తమరురచియించి అచ్చువేయించిన గ్రంథములు ఒక్కొక్కటి చొప్పున పంపించగలందులకు ప్రార్థించుచున్నాను దయయుంచవలెను.

ఓ॥ వెంకట్రామయ్య

(చిరకాలము క్రింద రచింపఁబడి 1907 వసం॥ అచ్చయిన మా కామేశ్వరీ శతకము నుండి.)

శా॥ నరనాథుల్ పలువుంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాస మ్మొనరించునట్టి పని నాచేఁ గాదు నీవంటి స

ఉ॥ అన్నము లేదొ? వస్త్రమునకైన కొదవ వుండెనొ! యున్నదానినే
మెన్నఁగ నెవ్వఁడుం దినఁగ నిప్పటికిన్ మఱి గాన రాఁడు నీ
యన్నముకోసమై మనమునందుఁ బ్రయత్న మదేల నాకు, నీ
చిన్నతనంపుమాటలకుఁ జేతము పొక్కుడి దుఃఖ మెక్కెడిన్.॥ ౮౮

ఉ॥ నిక్కముగాఁ బిఠాపురికి నేఁ జనుదెంచెడివాఁడ నేని ని
న్నెక్కుడఁగింపఁగా వలయునో! సరసాలుఁడు నిన్ను నన్ను నెం
తొక్కరుఁగూడ నేలుకొనఁడో టు! సమర్థత లేనివాఁడొ! నా
కక్కఱ యున్న తేనికడ కంతకు ముణ్జనుదేర కుందునే.॥ ౮౯

ఉ॥ ఎందఱొ భార్య లుండియును నింకొకచాన స్వయంవరంబుగా
నందము పొల్చుజాణ తనకబ్బినఁ గైకొనరే నృపాలు? రా
నందనునన్ మదీయకృతిచందనగంధిని గూడ మీనృపుం
డందఱితోటిపాటు తనయా! కొని యేలఁగ వచ్చునచ్చుగన్. ౯౦

తే॥ గీ॥ ఏకపత్నీవ్రతముగూడ నిట్టిపట్టు ,నందు రామాదులకుఁ బోలె నద్దువడద
రాము పేరిట నెంపఱు ధీమహీశులు, తమకృతికుమారికల నిచ్చి తనియ రయ్యె?

ఉ॥ జంకితి నందువో! యధిపునన్నిధికిన్ దగ నందువో! తదీ
యాంకణమందు నెక్కుడును నక్కటి? నాసరివాఁడు లేఁడె, "ని
న్నంగఁ గాకి పంజరపుసత్కృతికిన్ దగ"దందువే! యెటుల్
గొంకెదు సర్వముం దెలిసి పుత్రిక! తండ్రికిఁ జేటు గూర్చెదే. ౯౧

చ॥ కడియములోనఁ గల్గుజన కాండము సర్వము నెన్నిమార్లు నన్
గడెగడె కానృపాలమణిఁ గాంచఁగ నేగు మటంచుఁ జెప్ప? రా
నడు లవి నేను నూఁకొనియునున్ నృపుఁ జూడమికేమిహేతువో
కొడుక? యెఱుంగవే! యెతిఁగి కొంకక "కాక" మటంచు గెల్కెడే. ౯౨

క॥ కడియమునకు తేనికి నై, వ్వతు సంబంధంబు కలదు పుత్రిక! నీయా
ర్పడమికి తేనికిఁ గల దె, క్కడిసంబంధంబు? చెప్పఁ గలవే నాకున్.॥ ౯౩

---

టక్కరుణాశాలిని పెంపఁగాఁ బెరిఁగి విద్యాబుద్ధుల న్నేర్చి నేఁ
బరుల న్నిత్యము గొల్చు టొప్పగునె యంబాదేవి కామేశ్వరీ. ౧౫

క॥ ఏందుకుఁ జన మానితివో, పొందుగ* మును వ్రాసినాఁడ బొంకందువా? లే
కందుల కొప్పుదువో? నా, కిందులకున్ జింత లేద యించుక యేనిన్.

క॥ ఎన్నో బూతులు తిట్టితి, వన్నియుఁ గోకిలపుఁగూఁత లనుకొనియెద నా
మన్నయభీష్టము దీర్చితి, వన్నా! "శాక" మన నేమి యదియు ముదంబే.

తే॥ గీ॥ కడుపు నిండిన బేరమ్ము గాని నాకు, నేనృపాలునిఁ బూడంగ నేమివలయు
నట్టిచో నానృపాలకుఁ డాఁకఁ డతని, నేలవర్ణింప రాకుండ నెఱుఁగఁ జెపుము,

తే॥ ఎలమిఁ బిలిపించి న్యాయముగ నెంతొ పేర్మి, గారవించుచునుండె సూరి గౌరినాథ
శాస్త్రి, సూరులు నుద్యోగ సరణి నుంచి, యతని విడువత్తు నెట్టు లేనపులకపుర.

---

## (4) బందరు పర్వము.

క॥ గౌరీనాథ బుధుండనఁ, గా రాజో? రెడ్డో? చెప్పు శాకమ? యన్నన్
సూరియుఁ ద్యాగియు భోగియు, గౌరవభాజనుల నెఱుఁగు కర్మఁడు సుతా.

---

* గీరతము 1వ భాగము ఇతిహాసపర్వము చూ.

శ్రీ వేదమూర్తులైన శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి, జంధ్యాల గౌరీనాథశాస్త్రి అనేక నమస్కారములు... మీరుభయులున్నూ యిదివరకు ప్రతిసంవత్సరం అప్పుడప్పుడు సంస్థానములలోకి వెళ్లివస్తూ సంచారాభ్యాసంకలవారుగా నస్థాయిగా యేకత్రివుండడం దుష్కరంగా తోచునేమో అని వకరు అన్నారు అందుకు నేను కొంత సమాధానము చెప్పినాను ఇంతకు వెళ్లదగిన స్థలములు అయినవి మీకును సంచారమువల్ల విసుగుకలిగి వుండును పైగా వయస్సుకూడా వృద్ధియగుచున్నది ఇట్టిస్థితిలో స్థాయిగా విశుద్ధమైన జీవనోపాధి యేకత్ర దొరికినప్పుడు అక్కడ నే వుండి తీరిక కొలది గొప్ప గ్రంథములు గాని పాండిత్యముతో చేరిన మరివకటి గాని చేస్తూ కాలక్షేపం చేయడమందు మీకు తాత్పర్యం వుండవచ్చునని నేను తలుస్తాను మీరుభయులలో నెవరో యొకరు యీ ఉపాధ్యాయస్థానమును అంగీకరించవలసినదని నా తాత్పర్యము ముందుముందు దేశసంచారముగా కాలయాపన చేయడం దుస్తరంగా వుండును మీరు కావలసిన ప్రతిష్ఠను యిదివరకే పొందినారు కాబట్టి బాగా ఆలోచించి మీ జవాబు వెంటనే వ్రాయగోరుతాను వచ్చే అది

క॥ స్కూలుకమార్థులు మాకై చాలఁ యత్నించి సభను సల్పియు మొక్క మొ
న్నేలాగు గౌరవించిరొ!, బాలకి పొత్తమ్మునందుఁ బఠియింతవాకో. ౧౦౦

క॥ ఇంద రస నిట్టి దక్కఁడ "సందేహము లేదు భావశాబ్దికజీవుల్
చిందులు ద్రొక్కఁ జనఁగ గో, విందా! యనిపించు కవులు వేవేలు సుమీ.

క॥ ఇందరనఁగ నిట్టిది యట, నెందఱో యున్నారు యెల్లయెడ విద్వాంసుల్
తందర పడున వధానుల, చిందు లచట సాగి రావు శిష్యుఁడ! వింటే. ౧౦౨

క॥ ఇందరనఁగ నెట్టిది యని, "సందేహము లేదు భావశాబ్దికజీవా
నందుని బోలెడు శ్రీరా,ముం దగ సుకవుల ఆడిగి సమూల మెఱుఁగుసుమీ.౧౦౩

క॥ ఇందరులోఁ గోకిలకవి, చందిరులకు భిన్నమైన సాగదు కాకం
బుం దిలకింతురు కపటపు, బొందలయత్యద్భుతములు పొసఁగవు సుమ్మా.

క॥ ఇందరునకె యొకపరి మీ, "సందేహము లేదు భావశాబ్దికజీవా"
నందుని నే రమ్మంటిని, చిందులు సాఁగవని యటకుఁ జేరఁడు వినుమీ. ౧౦౫

క॥ అప్పటికిఁ జిలుక కాలే, దెప్పుడు పంజర మనంగ నెట్టిదొ యెఱుఁగం
డిప్పు డొకసారి యడుగుము, చెప్ప నతఁడు ధారణావిశేషము కలిమిన్.

క॥ ఇప్పటి కేనియు బహుమతు, లిప్పించెద వచ్చునేమొ? కృష్ణకవీంద్రుం
డప్పుడ పేర్చి రేపింపుము, చెప్పుము నరపాలుఁ డేల సెల వీఁడు! సుతా. ౧౦౭

క॥ సంగస్నాగారు వీణా, శృంగారవతీవినోదచేష్టావ్యాప్తి
త్వంగులు తత్స్వాంగాన్యా, లింగితులై యెటకునేని లేదే పనుటల్. ౧౦౮

తే॥ గీ॥ ఒక్కసంస్థానమందు మీయునికి కేమి, ఏటిపోలిక వారికి నెందు మీకు?

---

వారం తిరిగి మీటింగు చేసి యెవరినో వకరిని హేముఅప్పాయింటు చేయవలసి వున్నది రేపు స్కూలు ఆరంభము గాన అంతకంటె విళంబము చేయజాలము త్వరగాజవాబువంపించకోరుతాను మీయిరువురిలో యెవరుఅంగీకరించితే వారు హిందూహైస్కూలు కమిటీవారిపేర వకదరఖాస్తుకూడా వ్రాసినాపేరవంపకో రుతాను మీజవాబురాకపోతేయీఆదివారంనాడు దాటజాలను, చిత్తగించవలెను

జంధ్యాలగౌరీనాథశాస్త్రి

అక్కటా! *వీణరూపంబున దుగఁ బాడు, చేసినది చూచినే నెంతో సిగ్గువడితి.

క॥ ఈసిగ్గున కేమయ్యెడఁ, జేసిన యవధాన మందుఁ జెప్పిన కవనం
బే సరసముగాఁ బడినదొ, యా సర్వేశ్వరుని కెఱుక యది యట్లుండెన్.

క॥ అనరవతిలని మనయవ, ధానులు గండ లనఁ గీర్తి దవులు నదియుఁ గా
కే నాఁడు నాజ్ఞ గొని వి, ద్యానిధు లెక్కడికిఁ గాని యరుగుట లేదే. ౧౧౧

క॥ ఇది యిటులుంతము బందరు, వద నెట్టిదొ రామశాస్త్రిఁ బరమాద్భుతవుం
బదము గలశతవధానిం, గదిని యడిగి తెలిసికొన సకలమును దెలుపున్.

క॥ అప్పండితు నవధానము, నప్పుడు జడ్జీ కలెక్టరాదుల సభలో
నొప్పిరి నూ! వారె నీ! యనఁ, జెప్పె పెయాని యొక నమస్సు పెట్టె నడుగుమీ.

క॥ ఇది యవి స్తుత మతఁడును, వదయత నినుఁబోలెఁ గాక దక్కఁగఁ గొన్నా
ళ్లాదిగెం గాకము కడబ, ల్లిదుఁ డగు మీకృష్ణ సుకవి లీలన్ హేలన్.

---

## (౮) సమృద్ధి పర్వము.

---

క॥ ఇఁకఁ బ్రికృతము వినుమయ్యా, పికరాజమ! వెనుకఁ బోలెఁ బృథివీపతులన్
సక నక లాడెడి పొట్టకుఁ, గకవికిఁ గనుఁగొను ప్రసక్తి కలుగదు సుమ్మా.

ఉ॥ పొట్టలు మూడు మాని, సరిపోవును బుట్టెలు మూడు మాకు; ని
ప్పట్టున నాకు మాన్యముల వచ్చెడి శిస్తది చాలదొక్కొ, నీ
కెట్టులు దోఁచె! లోకు లిది యెట్టులు నమ్మెద రంచు వ్రాసి తీ
చెట్టతలంపు మాట! యిటు చెప్పుట పాపము కాదె పుత్రకా. ౧౧౨

---

(వెంకటరామకృష్ణగ్రంథమాల 74వ పుట నుండి.)

*వీణాస్వరూపము, కందము

క॥ వీణాస్వరూపమున్నఁగ, వీణాగానంబుఁ బొగడ వేడుకతోడన్
వైణికులనఖి నటింపఁగ, వాణియె యనమానురాలు వసుధాధీశా

(వంగమేశ్వరశాస్త్రి.) గారు కోరినది.

చ॥ నెల కొక నూటయిరూపికలు నీదయ కల్గి "కనీసపక్ష" మొ
ప్పఁ లొలుకు నాదుపుస్తకపుఁబుత్రులు దెచ్చి యొసంగువారు పై
నెలమిని రోజు కొక్కొక్కటి యిత్తురురూపిక నూర్లలోన నెం
దుల కికఁ దేవిరింపవలెనో? ననుఁ గోరని తెండ్ల సన్నిధిన్. ౧౧౭

ఉ॥ ఎక్కడి కేగ మారకయ యింటనె యుందమటన్నఁ గాని నా
కెక్కడినుండిరో సభల కెన్నియొ *జాబులు వచ్చుచుండు నం
దొక్కసభన్ బొనర్చినను నొక్కశతానకుఁ జాలు లేదు నీ
కెక్కడియూహ పుట్టెనో? నిది యెవ్వరి కిత్తును తెల్పు పుత్రికా. ౧౧౮

ది 30-1-10 ఆటపాక పోస్టు కృష్ణాడిస్ట్రిక్టు

*విధేయుబందారశ్రీశయిలంకృతానేకశరస్సాష్టాంగనమస్కృతులు. . తమతావునుంచి V. P. P. గారాబడిన నానారాజసందర్శనము సంగ్రహమును చదివి మిగుల ఆనందమును పొందినాను తమకీర్తిని యిదివరకేవినియున్నందున్నయప్పుడు తమ దరిశనంచేసితమవల్ల చేయబడు శతావధాన అష్టావధానములు కాంచవ గునా అనిమనస్సులోనాలోచించుకొనుచుండగా తమరుపంపించిన పుస్తకములలో నానారాజసందర్శనముయొక్క 10 పేజీలో 3పద్యమును 11 పేజీలోని 8పద్యమును చదివిన దాది నాయాశమరింత వృద్ధి యగుచున్నది గాని ... తమరునంపూర్ణవిద్యావంతులని యెరిగివుండిన్ని తమవల్ల జరుపబడుఅష్టావధానశతావధానములయొక్క కష్టము తెలిసి వుండిన్ని అవి తమవల్లజర్పబడిన పిమ్మట తమకునరియయిన్ని మన్నన రాజలోకమువల్ల జరుగవలయునేగాని మాబోట్లు యేమిచేయగలము అనేభయము ముందుగా కలుగుచున్నది అయితే చంద్రునకు నూలుపోగను సామెత ప్రకారం మాయొక్కశక్తిని గనిపెట్టితమవంటి మహనీయులు యట్లయినను మాకోరికతీర్చుడను ముఖ్యముగాఆలోచించవలశిన దయివున్నది యింతయందుకనియెదరా? ఆశాభంగము చేయుట న్యాయముకాదుగనుక బందరువచ్చిన కూడదనియెదరా? నావక్కసికే బందరువచ్చివినుటకు సాధ్యమగునుగాని యింకాకొందరు కూడా ఆశాబద్ధులయి వున్నందున రావీలుకాదనినావుద్దేశ్యం గనుక నాఅన్నవినంపూర్ణదయతో అంగీకరించి యిప్పుడయినను దరిశనమిచ్చి నాగృహపావనమయ్యేలాగు యీచీదవానిగు - - మ విజయం చేసి కొరికనుతీర్చగలందులకు ప్రార్థించుచున్నాడను సర్వజ్ఞులయిన తమకు నేను వ్రాయునంతటి వాడను కాన

ఉ॥ ఇంతటి దనర్హ ప్రాసకొనుటే విషయమ్ము స్వకీయ [illegible]
గొంతదానంగు, దాత, నని కూడ లిఖించుట యెట్టు లొప్పగా

---

ని తెలిసియుండిన్ని వ్రాశిన యీలోపమును మన్నించి తిరుగు జవాబు దయచేయ వేడుకొనుచున్నాను, దివ్యచిత్తముకు తేవలెను. శేషప్ప బండా శ్రీశయిలం.

---

సే॥ పండ్రంగి రామారావు అనేక నమస్కారములు చేసి చేయంగల విన్నపములు. . . వెనుక నేను మనవి చేసుకొన్నప్పుడు తమరు శతావధానం చేసెదమని సెలవుయిచ్చినారు గాని అప్పుడు మాయుద్దేశము నెరవేరలేదు ఇప్పుడు తిరిగి యిక్కడ కాలేజీ విద్యార్థులు చాలామంది తమశతావధానము నేచూచి సంతోషించవలెనని అతి కుతూహలము గానున్నారు పచ్చేపట్టాభిషేకమునకు మాకు డిశంబరు 7వ తారీఖునసుంచి వారంరోజులు శలవులువచ్చుచున్నవి గనుక అప్పుడు యీ కార్యము జరిగించగలందులకు మాఅందరిప్రార్థన అయియున్నది ఈవిషయమైయిప్పుడు తిరుపతి శాస్త్రులవారిదగ్గరకు వెళ్లి వారిఅనుమతిని పొందినాము వారుతమఅభిప్రాయముకూడా కనుగొండమని శెలవుయిచ్చినారు కాబట్టి మాయందుదయవుంచి మాప్రార్థన కనుకూలముగు జవాబు తిరుగు టపాలో వ్రాయగలందులకు గోరుచున్నాము.

పిఠాపురం రాజవారి
కాలేజీహాస్టలు
కాకినాడ

చిత్తగించవలెను
తమవిధేయుండు
పండ్రంగి రామారావు
27—11—11

ఇక్కడ కాకినాడలో స్టూడెంట్సు అవధానము చేయించెదమని అడుగుచున్నారు మీకును వ్రాయుదురు మీఅభిప్రాయము చెప్పుడు.... ది॥ తి॥

V. V. SUBBARAU, B. A., B. L., గుంటూరు.
12 ఆగస్టు 1911,

...కర్ణాకర్ణి వినియుండి మిమ్మును బ్రార్థించినచో బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రుల గారునహా మీరు వస్త్రార్పణసన్మానముతో నిచ్చట నీనెల 19, 20 తేదీలను తమరు ఉభయులను శతావధానము సల్పుటకు నేర్పాటు చేసినారము గాన మీరు దప్పక 18 తేదీకే దయచేసి మమ్ము నానందింప జేయ మిక్కిలిగా బ్రార్థించుచున్నాము.

సంత యుదారతాగరిమ యంటనిశిష్యులు బ్రహ్మశాస్త్రిస
త్రాంతర భోక్తలందుఁ గల రం చనుకోకు కుమారకా చెప్పితిన్. ౧౧౯

## (6) బ్రహ్మగురుపద్యము.

ఉ॥ అమ్మహనీయు పేరహరహమ్మును నీవును బావయాన్ జప
మ్మొమ్ముగఁ జేయుచోఁ గృతము నీగతిఁ జేసిన పాపమెల్లనున్
నమ్మయి పోవు వట్లొనరుపన్ బ్రయతింపుము రామదేవు పా
దమ్ములు వొల్చి క్షేత్రమునఁ దాన మొనర్చి పొనర్పు మిక్రియన్. ౧౨౦

---

తిరుపతి శాస్త్రిగారిని తీసుకొని మీరు తప్పక వత్తురని నమ్మకముతో కొన్ని ప్రయత్నములును జేసియున్నారము. కావున తమరు తప్పక రావలయును. చిత్తగింపవలయును.

ఇట్లు విధేయులు

రంగావఝ్ఝుల హనుమయ్య
(జిల్లాకోర్టుప్లీడరు.)
వేలమూరి వెంకటసుబ్బారావు,
జిల్లాకోర్టు శిరస్తాదారు.

గుంటూరు. 15-8-1911

...రైలుదగ్గరనుండి గ్రామములోనికి సకలసంభ్రమములఁ దీసికొనిపోవలయునని కుతూహలపడుచున్నారు. గనుక తాముభయులు సమకాలమున నే వత్తురని యెంతును.

శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి.

....తమకు లోగడ యుత్తరము వ్రాసియుంటిని ప్రత్యుత్తరము చేరలేదు. మరచినారనితో చెడిని. తమరు రేపుసాయింత్రము బయలుదేరి యల్లుండి గుంటూరికి చేరెదరని యుత్తరము వచ్చినట్టు తెలిసినది. తమరు శ్రీతిరుపతిశాస్త్రిగారు ఒకసారిగా గుంటూరుకు దయచేసిన యెడల యుత్సవరూపకముగా గ్రామములోకి తమరిని తీసుకరావలయునని నాకోరిక. దీనిచేతనే యీసాయంత్రము శ్రీహనుమచ్ఛాస్త్రిగారిని యీవిషయమై తమకు వ్రాయమంటిని. శుక్రవారము సాయంత్రముకు బెజవాడరయిలు స్టేషన్ వద్ద నత్రిమువద్దకు తమరుదయచేసిన యెడల నేను శ్రీతిరుప

చ॥ ధవళగిరిన్ మహామహుఁ డతం డొకసత్రము వెట్టి శిష్యులన్
గవులను జేయుచున్ సుఖముగా మఱి వారికి నర్థికోటికిన్
బ్రవిమల మన్నదానము నపారముగా నొనరించెఁ దద్గురున్
దవిలిన శిష్యుఁ డించుక యుదారత నేర్పుటదేమి లెక్కయా. ౧౨౧

ఉ॥ అమ్మహనీయునింట నెల యయ్యెడు నంతకు నొక్క పుట్టెడి
య్యమ్మ సుమారు వారుఁ దమదైన కుటుంబముగాక శిష్యసం
ఘ మ్మతిథివ్రజమ్మును సుఖమ్ముగ భోజన మాచరింపఁ బు
ణ్యమ్మున బ్రహ్మపండితునికన్న మఱొక్కని కెన్న నున్న దే. ౧౨౨

ఉ॥ ఉన్నది రెడ్డిసీమ, తమ కుండెడి దించుక వృత్తి, దాని కె
న్నెన్నియొ రోగముల్ కుదిరెనేని ఫలించు, ఫలించు దానిలోఁ

---

తిశాస్త్రిగారు కలసి అందరము శనివారము ఉదయము గుంటూరు చేరుదము. గుంటూరు స్టేషనువద్ద స్నేహితులందఱు తమరాకకు యెదురు చూచుచుందురు గనుక యీప్రకారము చేయుదురని నాకోరిక. గుంటూరు. 15-8-11

మజుందారు వెంకటహనుమంతరావు.

---

...తామున్న ఆరోజును యిచ్చటికి దయచేసి సభ జరుపగలందులకు మిక్కిలి వేడుకగలవారమై యున్నారము.

యిట్లు విధేయుడు,

15-9-1911.

తూములూరి కోటయ్య,

పినపాడు, మారీసుపేటపోస్టు.

---

గుంటూరు.

4-11-11

...12-12-11 అద్దంకిలో అవధానమట వత్తురా? సత్తెనపల్లికి వచ్చే ఆదివారం రాగలరా? ..

రంగావఝ్ఝులహనుమయ్య.

---

ఇట్టి యాహ్వానపు టుత్తరములు కొల్లలు గాని గ్రంథవిస్తరభీతిచేత నేమి చాదస్తులనుకొందురనియేమి, యింతతో విరమింపఁ బడుచున్నవి.

విన్నది గాక తా రయితుదెచ్చి యొసంగుఫల మ్మదెంత హా
చ్చున్నను వీరికొక్క నెల రూపునొ? రూపదొ నందియ మ్మగున్, ౧౨౩

క॥ ఆయనఘాత్ముని భార్య గ, దానియిల్లాలనఁగ నాఖ్య యన నేలని నిజం
బే యన్నపూర్ణ యాపె వృ, థాయంతురె యట్టి పేరు తజ్ఞులు పెద్దల్. ౧౨౪

ఉ॥ చెన్నఁటి చూపు చూచి యొకశిష్యుని నేనియు నేమిరా! యటం
చు న్నిరసించి పల్క దిది చోద్యము, దేశికభార్య లిట్టివా
రున్నది వింటివా? మఱియు నొక్కటి, లోకులు తన్నుఁ దిట్టినన్
సన్నుతిఁ జేసినన్ సమము సాటి మ ఱెవ్వరు? బ్రహ్మరాణికిన్. ౧౨౫

ఉ॥ "జాతకచర్య,,యందు గురుసంతతిఁ దెల్పెడుపట్ల వీరివి
ఖ్యాతిని విస్తరించితిని నక్కడఁ జూడఁ గలాడఁ విందులోఁ
బాతకహారి తచ్చరిత పారము నీకును నాకు బావకుం
బ్రాఁతదానంగులన్ దొలిచి భద్రములన్ గలిగింప నెత్తిలిన్. ౧౨౬

శా॥ ఏనే కాదు మఱొక్క శిష్యుఁడును మాయీసద్గురుబ్రహ్మవి
ద్యానాథున్ సురభాషలోఁ దెలిపి కార్తఘ్నాఘభారాపహా
ధీనానూనవచస్కృతన్ బరఁగెఁ దద్వ్యాఖ్యవచోధార, ని
త్యానందాత్ముఁడు సద్గురూత్తముఁడు,ని న్నత్యంతమున్ బ్రోచుతన్. ౧౨౭

ఉ॥ ఎంతటి పాపమేసి రచియించునుగాక కృతఘ్నుఁడై బుజా
స్వాంతు గురూత్తమున్ దెగడి వర్తులఁగా కలచర్ల బ్రహ్మవా
క్కాంతుచరిత్రమున్ జదివి కాఁగలఁ డుత్తముఁడంచు నెంచు మ
త్స్వాంతము, తచ్చరిత్రము కృతఘ్నుఁ గృతజ్ఞు నొనర్పఁ జాలదో. ౧౨౮

క॥ ఆచరిత వ్రాసినతఁడును, నాచినతండ్రి కొమరుఁడును నాకడఁ దిర్ప
త్యాచార్య నొద్ద శిష్యత, నూఁచి పిదప బ్రహ్మసేవ నూఁచి రెఁటుఁగు మీ.

క॥ కానసతండు సతీర్థ్యుఁడు, మానిజశిష్యుండునగుట మాకడకల*బ్ర
హ్మానూన చరిత నంపెను, దీనిని ముద్రింపుఁ డని విధేయతకలిమిన్. ౧౩౦

---

## *శ్రీచర్ల బ్రహ్మగురువరచరిత్ర సంగ్రహము.

...శ్లో॥ విద్యావానగృహాం వరోపకరణోత్పత్తిస్థలం సత్కృపో। పుణ్యం పుంజిత
సత్త్వ మున్నతయశఃకాయం ప్రతిష్ఠాలయం। రాజత్సద్గుణతత్త్వరోహణగిరిం ధర్త్ర

చ॥ అలచరితంబునీపుశుభమౌవని కొంతయుఁ జాలునంచు ని
మ్మలఁ గొనికొంత యియ్యెడల ముద్రితముం బొనరించువాఁడ రా

---

స్వరూప మ్మదా। విద్వద్బృన్దవతంస మాత్మని భజే బ్రహ్మణ్యవిద్యాగురుం॥ 3॥ శ్లో॥యచ్చాకృత్య మనుష్ఠితం ... దనృతం ప్రోక్తం య దంహః కృతం। వాక్చిత్తావయవై ర్విసర్గఖలసంసర్గప్రమాదాదిభిః। వక్ష్యే బ్రహ్మగురోః పవిత్రచరితం తత్పావవిచ్ఛిత్తయే। నాహం నృస్యాస్య దధికో గురో రితి భుజ్ఞానప్రదాతా యతః॥4॥ ...శ్లో॥గోదావరీమండలరాజమానో నీలర్క్ష భగ్రామవర (కటియెద్దు) శ్చ శాస్త్రి। ఆరాచ్చ విద్యాధరతీర్థవర్యా, దృత్రాం విరాసీ ద్భగవాన్ కుమారః॥ 7॥ శ్లో॥ద్విజ స్తస్మి న్నేకోఽవన దుతవన ద్రావిడవరః।ప్రసిద్ధో వీరాఖ్యో జనిముపగతో లోహితకులే। లసచ్చర్లో పాఖ్యో నియమితమనా స్వం చ్ఛచిరపి। హ్రిదాలోకేకుర్వన్దినకరనతీ ర్భక్తి కలితః॥ 8॥శ్లో॥ప్రాణాం భోసిధరంధ్రవారిధిమితే వర్షే వ్వతీతేషు స। త్స్వకల్యాదిచ శాలివాహనశకే షట్పాస్త్రిహానీంధుషు। క్రోధ్యబ్దేచ సహస్యమాస్యధవళే పక్షే తృతీయే తిథౌ। జజ్ఞే తస్య చతుర్థసూను రిహాచాం ముత్రాంర్థసంసాధకః॥ 9॥ శ్లో॥ధాత్రీణా ముపబృంహణా దుతలసద్ధర్మ స్యపుణ్యస్యవా। విద్యాయా అథవా నచే దధిగతబ్రహ్మైక భావస్థితేః। యద్వాఽశేషజనోపకారక కలాశాలాదినిర్మాణతో। బ్రహ్మేత్యుత్తమనామ సార్థకతయా పిత్రాఽస్య నిర్ధారితం॥ 10॥ ...శ్లో॥వారాణసీం। జిగమిషుః పరిశిష్టశాస్త్రః। పాఠాయ భూసురవరస్య గురోరనుజ్ఞాం। లబ్ధ్వాతికౌతుకయుత స్తదను ప్రతస్థే। పాథైస్వతీర్థ్యనివహైరపిభావ్యమానః...శ్లో॥ ఏవం పరత్రాఽత్ర సుఖైకహేతుం। వారాణసీం పత్తిపరో వివేశ। దేశాచ్చ దేశం విచరన్ జవేన। విశ్వేశగఙ్గాబుధదర్శనేచ్ఛుః॥31॥ .....శ్లో॥కాశీనాథబుధో హి యద్గురువరః కాశ్యాంవశిష్ఠాయితో।యచ్ఛిష్యస్యకళార్థవిద్గురుయశా శ్రీబాలశాస్త్రీ మహాన్। ఏవం శ్రీహరిశాస్త్ర్యనుత్తమగుణో వ్యాఖ్యార్థవాదీ్రికరః। కాశ్యాంభూపనిషేవితో వ్యజయత శ్రీరాజరామో బుధః॥34॥ శ్లో॥సంఖ్యావత స్తస్య పటుస్స సన్నిధౌ। వ్యాఖ్యానకోశాన్ పఠితుం ప్రచక్రమే। సఖ్యాదృతస్స న్నిబుధేంద్రమండలీ।ప్రఖ్యాతకీర్తిః కలితః కలాగుణైః॥35॥ ... శ్లో॥అత్రాన్తరే జనకజేన పత్రికాఽస్య। దాహూతః పరిణయమస్య కర్తు మారాత్। గుర్వాశీర్గణపతిపూజయా స్తదాత్వే। ప్రత్యక్షం ఫలమివ దర్శితం జనానాం॥ 41॥ ...శ్లో॥ఇతి షోడశవాసరా నుషిత్వా। నిజగేహే స్వవివా

ష్యులు గురుపట్ల నిట్లుగను కొందఱు శిష్యులు వ్రాయువారిఁక; లే
ఖలుఁడును పాడువారిఁకలకు గాదగఁ డంచిది చెప్ప నుప్పగన్. ౧౩౦

---

హ సంభ్రమేణ। నిజసోదరదుర్గతం డితేన। ప్రతిగన్తుం ఖలు నిశ్చితాయ తాశం॥ 59॥
...శ్లో॥షట్సు శాస్త్రేషు షడంగేషు షడ్భాషా షణ్మతేషుచ।ప్రజ్ఞా యస్య స్థితా తస్మై
బ్రహ్మతంత్రాత్మనే నమః॥ 61॥...శ్లో॥ఇత్థ మేవ నృపసన్నిధౌ బుధైః। శాస్త్రేష్వ
పరీక్షితో భవన్। శ్లాఘితో బహుమతస్సభాస్థలే। నిర్జగామ బుధనిర్జయాయ సః॥
67॥ శ్లో॥ అయోధ్యాకురుక్షేత్రనేపాలగంగోత్తరా వైద్యనాథం జగన్నాథతీర్థం
హరిద్వారకేదారబృన్దావనాద్యం। మహాక్షేత్రజాతం సిషేవే సుధీరాట్॥ 68॥
...శ్లో॥దూరేణ కాలనియమేన బహుద్విజానాం। కోలాహలేన నియతాశనభోజనేన
సతేర్ము భుక్తి రధికశ్రమకారిణీతి। జ్ఞాత్వైష శిష్యనివహాయ దదాతి చాన్నమ్॥
72॥...శ్లో॥ఇతి జగదుపకారస్య। ప్రతిపద మఖిలైస్సు సుత్యమానస్య। పరిణామశూల
బాధా ఽపరిణతవయసోఽపి దేశసంచారాత్॥ 78॥...శ్లో॥ శనకై రగమద్విద్వాం
త్స్వగ్రామం "గుకడియద్ద,,నామానం।శ్రీరామో వనవాసాదివ సాకేతం నృణాం
ప్రమోదేన॥ 97॥ ...శ్లో॥ స్వసాల్యకః పరితః పూరభతాఽగమం యః। శాస్త్రాణి
పాఠయతి శిష్యగణం స్వపశ్చాత్। విద్యార్థినాం తిరుపతిః కవివేంకటేశో। యా
తౌ చ యా కవితయా గురుకీర్తిసాన్ద్రా॥ 101॥ శ్లో॥ కింపు తచ్ఛాత్రనామాఖ్యా
యా స్యాత్ఫలం। తస్య సంఖ్యా మతీతాగతా ఛాత్రితాం। చిత్ర మేత న్మహాత్మే
ష్వహైకోఽపివా।ప్రాకృతోఽపండితో నాఽభవత్పశ్యత॥102॥ ...శ్లో॥ముహున ద్వా
రోధశ్చరపరిచరియా దత్రిచ ముహుః। నదీతీరే వాసం మనసి కలయన్పండితవరః
సహచ్ఛాత్రై ర్గౌతమ్యఘహరతటే వస్తు మనసా। నిజగ్రామా ద్వాసం ధవళగిరి
హాదే ష్వలభత॥ 105॥...శ్లో॥ న కేవలం ఛాత్రగణాయ భోజనం। దదాతి పాంథా
వళయేచ సన్తతం। తత స్తదీయం సదనం సమీర్యతే।న పాఠశాలేతి సత్రమిత్యపి॥
107॥ శ్లో॥రాత్రౌ త్రియామారసమయే ప్రబుద్ధః। క్రమేణ శిష్యానఖిలాన్ప్రబోధ్య।శా
స్త్రాణి సంపాఠయితుం ప్రవృత్త।స్సమాపయేద్ద్వాదశఘటికాన్తే। 108॥ శ్లో॥
వ్యాఖ్యానేషు పాఠయన్ప్రథమత స్తద్వ్యాఖ్యాకాం ఛాత్రయే, త్పశ్చాత్తానపి
పాఠయం స్తదధికాం త్సంశ్రావయే ద్బోధకృత్। ఏవం సర్వకలార్థినాం
క్రమవశాత్పాఠాం త్సమాప్య స్వయం, మధ్యాహ్నే దథ తా స్పరస్పరమహో
హారా న్స్వన శ్చింతయేత్॥ 109॥ శ్లో॥చిత్రం కేచన కావ్యనాటకమహాలంకారచ

మ॥ గుణశక్తిన్ బరశు ప్రచారనిరత క్రూరావనీపాల సం
హారణప్రాప్త యశోభిశోభి జమదగ్న్యత్యోద్భవున్ దెల్పు నా

---

మూర్ధాముఖ। గ్రన్థా న్వాచకశిష్యవర్గసవిధే సమ్య క్పరస్త్యోఽనిశం। సాహిత్యప్రచు రాన్తత స్సవినయం బ్రహ్మాఖ్యసూర్యన్తికే। శ్రీమద్వాక్కృతి మధ్యగీషత కిమ స్య స్మాత్తత్కలాకాంక్షిణాం॥ 110॥ శ్లో॥ యాదృక్ప్రేమ గురో స్స్వశిష్యనివహే గురావ్వ స్తతో పుత్ర్యస్మతం, ఖ్యాతైః కిం సుతనిర్విశేషమపి తౌ సంపశ్యతో జంపతీ, దూరే బంధుజనా న్విహాయ పితరౌ దేశంచ విద్యార్థినాం, బాలానాం కిము సౌఖ్య మస్తి గురునతాకరుణ్యతోఽన్యద్భువి॥ 111 శ్లో॥ శ్రీకాశీసంప్రదాయానుభవ మనుసృత స్తత్ప్రవిద్వద్వరిష్ఠో, వర్షేవర్షే స్వశిష్యైర్గణపతినవరాత్రోత్సవం కారయిత్వా, భూరిద్రవ్యవ్యయేఽపి స్వయ మధికయశోభాజనంస న్మహాత్మా, కాశీతోఽప్యన్నదానం సమధిక మితిసంశ్లాఘితో బోధవీతి॥ 114॥ శ్లో॥ దానం కలావమృతిసాధన మిత్యపోచన్, దానే ష్వనుత్తమమితిస్మృత మన్నదానం, ప్రత్యక్షభూతపరితృప్తినిదానభూత, మిత్యన్వహం వరిత నోత్యమితాన్నదానమ్॥ 115॥ శ్లో॥ ద్విజో భూత్వా కింస్యా త్ఫలమిహ నచే చ్ఛాస్త్రపఠనం, నశాస్త్రైణా స్త్యర్థో నయది పరసంబోధనగతిః తయా నావ్యస్త్యర్థో యది న సదనుష్ఠానపరతా, పరంతత్వా సాఽపి ప్రకృతిపిశునేఽస్మి న్విలసతి॥ 116॥ శ్లో॥ నిస్స్వాన సన్యగతికా నితరా న్ద్విజాతీ, న్విద్యార్థినశ్చ కృతదారపరిగ్రహాంత్స॥ కాశ్యామివ ద్విజసమస్కరితాం ప్రదాన, లబ్ధాతిదోషహారణాయ కరోతి విద్వాన్॥ 117॥...శ్లో॥ మధ్యే మధ్యే కేనచి ద్దేతునాఽయం। భర్త్రైవ రోధైర్యైర్లబ్ధుకై రన్నదానం। భూదేవానాం సంభ్రమా త్యంతనోతి। ప్రాజ్ఞస్యాఽస్తేభూతతృప్తేః పరం కిమ్॥ 125॥ శ్లో॥ అశాశ్వతో దేహ ఇతి ప్రసిద్ధం, భూయాత్స్వరే యుమ్మ్రమహారశాలా, ఇతీవ మత్వాస్థిరజీవనార్థం, స్థిరాం సమార్జ్య స్థిరకీర్తిరాసీత్॥ 126॥ శ్లో॥ చిత్రం ద్వాదశవాసరేషు మిళితాన్ గోదావరీపుష్కర, స్నానార్థం ప్రతిపఙ్క్తి చోపదిశతో విప్రాం త్స్వహస్తాధికాన్, నాఽ గోచ్య శ్రీమమునన్నం ధన మయం సంపాద్య భుఙ్క్తేఽథి, స్వాతిరాప్య ధికఫణ్య మాప భువి కిం దృష్టిః క్వచి త్తత్సమః॥ 127॥ ...శ్లో॥ వికారినామాఽ సువికారకాలే, సమాగతషడ్గ్రహమాలతోఽజ్ఞః, పుణ్యోవ్యయం బ్రహ్మగురో రతీవ ఽ, సహిష్ణునాజ్ఞప్తఇవాబ్జజే॥ 129॥ శ్లో॥ భూదేవాయుతతర్పణం దశదినైర్గోదావరీతీర్థోజ్జ్వల, తోర పూర్వాఖ్యపురేఽన్తి ప్రవిలసత్ప్రోటిరింగస్థలే. క్షేత్రే పాదగయాహ్వయేఽపిచ నిజశ్వే

కరరే? యిట్టింప వెట్లు శిష్యుఁ డయి కోఁ? యంతేవసద్ధర్మరు
ర్మరణోపజ్ఞదురువ్యమక్వధితధీరవాస్త్రితచేతోంబుజా. ౧౩౧

మ॥ గురుభక్తిప్రథితుల్ మహామహు లనేకుల్ సర్వలోకైక దు
స్తరవిస్తారిత నిస్తులైన నితాంత ధ్వాంత నిర్మూలనా
పరభాస్వత్తప భాస్కరుల్ వోలుచు నీకాలంబునన్ నాకు నీ
వరరే? శిష్యుఁడ వెట్టులైతివొకదా? యాచార్యనిందావహా.

తామ్రపుర్యాం తథా, కర్తుం బ్రహ్మసుధీ రిమేష జగతః క్షేమాయ కామాయచ॥ 130॥ శ్లో॥ నవగ్రహ జపగ్రహ ప్రభు నమస్క్రియా వేదన, త్పురాణపఠ నాద్యభి ష్పవది గోపదక్షేత్రకే, సుతర్పయితు మన్నతో దినసహస్రవిప్రోత్తమా నుపాకృమిత బాహుళ ప్రకమనానరే పండిత॥ 131॥ శ్లో॥ జగత్రయణయతో బతప్రవిగ తాంబగక్షేమస్య, దృఘోత్తమవినాశనే జగదుపప్లవ స్స్యాదితి, తదష్టమదినే బుధం జ్వరగ ఏలేన సంపీడితం, కృపావిరహితా ముహుర్ముహు రకార్షు రుగ్రగ్రహాః 132॥ శ్లో॥ శమ్యాం కృతార్థస్థితౌ బ్రహ్మవిద్యా నుపక్రాన్తమన్త్రాదిశాన్తిం సమాప్య, సుభ క్షేష విప్రేషు పశ్యత్సు తుష్యన్। పరిత్యజ్య దేహం గతో బ్రహ్మణైక్యం॥ 133॥ శ్లో॥ దినగతే బ్రహ్మబుధే ధరాఽసీత్ స్వశక్తిహీనా బతధర్మశూన్యా, కలార్థివర్గో విఫలో బభూవ। క్షుధాతురః పాన్థగణ స్తదాఽసీత్॥ 134॥... శ్లో॥ తత్పాదలః పతితాగమ స్సుగుణభా, శ్రీధిశ్వనాథో బుధస్థితాస్వ తతప్రతదార్జితావనిఫలై స్స్వస్థాశనై స్స తర్పితైః. విద్యార్థిప్రకరం యథాకథ మథో తత్పాఠశాలాగతం, విద్యాబుద్ధి యుతం కరోతిహి గురో ర్ధన్యత్వమాపాదయన్॥ 136 శ్లో॥ వేమూర్యపాఖ్యనరసింహ కృత్యం సభక్తి, శ్రీబ్రహ్మపండితచరిత్రమిదం పవిత్రం, యావద్దివాకరనిశాకరతారకాళిః స్తావ జ్జనే త్సుఖయుతా మనుజా భవేయుః॥ 137॥ శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

(శ్రీగురుబ్రహ్మైక్యమునుగూర్చి మేము చెప్పినది.)

మ॥ కలిమానం బాకయొదవే లరుగ నేకత్రస్థసప్తగ్రహా, మ్మలనన్ శాంతి సానర్పుచున్ శ్రమ లవమ్మున్ లేకయే బ్రహ్మమున్ గలిసెన్, బ్రహ్మగురూత్తముండు దశమిన్ గంజాప్తవారంబునన్, ఖలసంచారి వికారి కార్తికపరీక్ష శీకపక్షమ్మునన్, తి॥ వెం॥

మ॥ ఒకఁడుగా గన్పఁడఁ డిట్టియాకలిని నీ కౌశిష్యు? తుల్యుండు పా
య మహాధ్యాయునిఁ గొల్వకున్న నతఁ డత్యంతమ్ము పాపాత్ముఁ డం
చకటా! వ్రాసెడియంత సాహసి; మదీయాఘప్రభావంబె నిన్
వికలాత్మున్ బొనరింపఁ బోలును జుమీ! వేత్తృత్వసత్త్వాఖనీ. ౧౩౩

శా॥ నీకున్ జిక్కిన యీకృతఘ్నతను నేనే నేర్పినట్లే తుదిన్
లోకుల్ వాకొనువార లేమొ? యని లోలోఁ జింత నేఁ గాంతు వి
ద్యాకల్పద్రుమ మన్మదీయగురు లేతన్నింద రాకుండ నా
పాకం బేర్పడఁగా వచించి ననుఁ గాపాడన్ బ్రియత్నింతురన్. ౧౩౪

ఉ॥ ఏ కుటిలంపుఁ బాపములు నీయఘతుల్యము కావు భారత
శ్లోకము లిట్లు చెప్ప నవి సూరివరుల్ శిరసావహింత్రు నా
లోక, *చరిత్రలోఁ గను మలీకము గాఁ దలపోయఁ బోకు మా
రా! కలికాలమేని యఘ మంత సహింతురె ధర్మచింతనుల్. ౧౩౫

చ॥ గురుఁ డొకచో నహేతుకము గొండొక వేఁడిమి నూనుఁగాక క్రో
ధ రసము తగ్గఁ జేయు టుపాయము లుండవె? వానిమీనముల్

---

*(మహాభారత శాంతి పర్వమునుండి)

శ్లో॥ బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా
నిష్కృతి ర్విహితా రాజన్ కృతఘ్నే నాస్తి నిష్కృతిః
కుతః కృతఘ్నస్య యశః కుతః స్థానం కుతః సుఖం
అశ్రద్ధేయః కృతఘ్నో హి కృతఘ్నే నాస్తి నిష్కృతిః॥

(తెలుఁగు భారతము నుండి.)

క॥ అని చెప్పె తాత యిట్లను, మనుమనితో నాదగమున మఱియును బ్రహ్మ
ఘ్నునకును నిష్కృతి గలుగును, వినుము కృతఘ్నునకు లేదు విపులచరిత్రా.

క॥ ఆరయ మిత్రద్రోహము, దారుణ మగుపాతకము కృతఘ్నతకంటెన్
వైరము గొని విడువ వలయు, నా రెండు తెఱఁగులవారి నాప్తులనైనన్.

§(స్కాందోత్తర ఖండస్థ గురు గీతనుండి.)

శ్లో॥ శివక్రోధా ద్గురుస్త్రాతా, గురుక్రోధా చ్ఛివో న హి
తస్మాత్సర్వ ప్రయత్నేన, గురో రాజ్ఞాం న లంఘయేత్॥

బెఱుకుట, వాని గ్రంథములు వెక్కిరించుట "వేరు" లాటయున్
జరిగెనె యెన్నఁడేని? యొక ఛాత్రు నుదాహరణంబు చూపెదే. ౧౩౬

ఉ॥ ఊరక యుందు నేని యఘ మూరక యుండదు నీకు బాధకం
బై రహిఁ బీడ వెట్టు నది యస్మదభీష్టము గాద యిప్పుడో
కారణ ముండి కాళ్లఁ బడఁగాఁ జనుదేరక యుండుగాక నీ
దూగచనన్ గుఱించి మది దుఃఖము చెంది సుఖింతువావయిన్. ౧౩౭

చ॥ ఎఱిఁగి యెఱుంగ కేయఘము నేని పొనర్చియుఁ బిమ్మటన్ జనుం
"డరరె? యఘంబు చేసితి నటం చొకకొంత మదిన్ దపించి దు
స్తర మగుపాపమేని యను దాఁటఁగఁ జాలెడిఁ బైకిఁ బావమున్
బారయుట తెల్పెనేని సరిపోయె నిరాగసుఁ డాతఁ డంతతో. ౧౩౮

ఉ॥ ఎన్నఁటికేని గాళ్లఁ బడుటే నదుపాయ, మఘంబు నాఁడె పో?
సన్నగిలున్ గురున్ దెగడుసాహస మాని యెదో లిఖించి నం
తన్నగ్రహాస్థు లాజనులమన్ననఁ గైకొన వెవ్వరో నినున్
"బన్నము మాగు మా" గనినఁ బాడకు నోరికి వచ్చినట్లుగన్. ౧౩౯

ఉ॥ చెప్పెడివారు నీ కకటా? శ్రేయము గూర్చెడివారు గారు నా
చప్పనిమాఁటలే తుదకు సద్గతిఁ జూపును నీకు; సూర్యరా
విప్పుడు నిన్నుఁ గైకొనుటకేనియు నే నిడుచప్పుమాఁటలే
తప్పక కారణంబగుసుమి తప్పదుత్రో వికనేని వీడుమీ. ౧౪౦

---

## (7) ఆత్మవైభవపర్వము.

ఉ॥ నన్నును గారవించు నరనాథులు లే కొకసాఁకు వన్ని నీ
యున్నపదంబునం దెటులనూ వడ నెంచితి నంచు నెంచ కెం
దు న్నను గారవించు నృపతుల్ శత మన్నను లోక మొప్పు నీ
వన్నను విశ్వసింపవలదా? యిలఁ దా నకలం బెఱుంగదా. ౧౪౧

ఉ॥ అప్పనృపాలుఁ డింక సుకయబ్దములోఁ దన పోకెఱింగి మేల్
చిప్పిల "శాస్త్రిగారికెటు చేసితి వార్షిక మెల్లకాలమున్
దప్పక యట్టులే యిడుఁడు నాకు ముదం బగు దానఁ జేసి" యం
చొప్పఁగఁ జెప్పె నీ, వెఱుఁగవో సుత! కోకిల పైతి వంతకే ౧౪౨

చ॥ ఉడుగక వ్రాసి తెందులకొ యొజ్జలకుఁ "గురుఁ డాతఁ డంచు నే
నొడువక యున్న శిష్యుఁ డని నూటికిఁ గోటికిఁగూడ నీవు నై
ప్పెడునది చాలదే" యనుట పెంకెతనం బిది, "యింటివాఁడు పే
రిడి యిది గొడ్డుగేదె" యన నింకొకఁ డాడునె పాడి గేదెగన్.

---

... ... శా॥ గంగోత్తుంగతరంగఘుంఘుమరవాకారానుకార్యార్భటీ, భంగిన్ ద్రాక్షగుళుచ్ఛవిస్ఫురితరసప్రచ్ఛన్నవేషంబు మీ. సాంగత్యమ్మునఁ బొల్చు నత్కవితకే, చందంబునన్ సాటి? భూ, మిం గ్రీఁగంటిప్రసార శూన్యకవితా మీ నాక్షు లూహింపఁగన్.........ఇట్లు జూవ్వాడి, హనుమచ్ఛాస్త్రి, శతావధాని.

చ॥ చదువుడు సూరనాది కవిచంద్ర పటుత్వ కవిత్వసారముల్, ముద మొదవ నూరుచుండ మనసున్నఁక నెప్పుడు గూడ నబ్బె నా, హృదయము గీరతామృత మొకింత చవింగొను నాఁటఁగోలెఁ బా, యదురుచి సర్వకాల మధురా? శవనం బిటులుండు టొప్పదే.

ఇట్లు విన్నవించి నమస్కరించు

ఆర్యాపురము, విధేయుఁడు

రాజమహేంద్రవరము 18-1-1913 భమిడిపల్లి సీతారామయ్య.

---

......నవీనముగా రచింపబడిన పంచమ వేద ప్రతిమానంబగు గీరతంబును దయచేయించ గలందులకు ప్రార్థన చేసుకొన్నాను.

నరసింహదేవర గవరయ్య

సా॥ వెలగదుర్రు, తణుకుతాలూకా.

---

(1)...కలకత్తా చేరినాను, తమగీరతము వినవలయునని యిచ్చటి యాంధ్రవిద్యార్థులందఱు నువ్విళ్లూరుచున్నారు. కాన యీజాబు చూచినవెంటనే తమగీరతము నీక్రింది విలాసమునకు పంప ప్రార్థించుచున్నాను.

(2)...గీరతమును శిరసావహించితిని ఆగ్రంథరాజము నొకపరి చదివి తనివిదీరక యవకాశము చిక్కినప్పుడెల్ల నందలి భాగముల మాటిమాటికిం జదివి యానందించుచుంటిని.

Cantu Subbavadhany
191 Bow Bazar
Callutta

క॥ కల రెండేని శిష్యులు, కలిలో నాకుఁ బలె నితరకవులకు మఱి వా
రలకుఁ గా వారికిఁ గలవాము, గలుగని దెటు! నీకు నాకుఁ గలిగిన దెట్టుల్.

సీ॥ నారాయణాస్త్రమ్మునకు నమస్కారమ్ము శ్రీకృష్ణుఁ డానాఁడు చేయలేదె
భీష్మసాయకవహ్ని బిట్టేర్చు చుండంగఁ గృష్ణుని ప్రతిన చెట్టైకలేదె,!

---

......గీరత సందర్శనార్థమై చంద్రచకోర న్యాయముగా వేచుచున్నాడను.
వేగిరమంపఁ గోరెదను. చిత్తగించవలెను.

K. V. Kristna Rao

చీరాల ది 30-6-12

......గీరతము అనుమహాగ్రంథమును వకటి నాకు పంపఁ గోరుచున్నాను యీగీర
తము నేను చదివి జన్మసాఫల్యము చేసుకొనుటకై వ్రాసుకోవడమయినది.

తేలప్రోలు సుబ్బారావు వ్రాలు.

---

......మ॥ వెన్నంబోలిన మీకవిత్వ మొకఁబల్ విందయ్యె మిమ్మిప్పుడే, గన్నా
రంగని నే భవన్మధుర వాగ్వ్యాఖ్యానవ్యాలోకనో, త్పన్నానంద విచిత్రచారు
మణి సౌధంబెక్కఁ గాంక్షింతు ర, మ్మన్నన్ వచ్చెదఁ జెళ్లపిళ్ల వరవంశాగ్రణ్య
ముక్తామణీ . సీ॥ అష్టావధానశతావధానము లనువని చిన్ననాఁడె నేర్చినది కాదె
వాగ్వాదమందు విద్వాంసుల గెల్చుట కరతలస్థామలకమ్ము కాదె, రసవత్ప్రబం
ధ నిర్మాణ చాతుర్యమ్ము తమకు స్వార్జితమైన ధనము కాదె, దిక్ప్రథసంచర
త్కీర్తి మీకొక స్వయంవరలబ్ధయౌ ధర్మపత్ని కాదె, గీ॥ యనుచు నుతులను సా
మాన్యజనమె కాదు, వైరులకునైనఁ జేయక తీరదనుచు, నాకుఁదోఁచెను సత్కవిలో
కతిలక, వేంకటేశ్వర కవివర్య! వినుతచర్య. చ॥ మఱియొక చిన్నవిన్నపము
మన్నన చేసెద రంచు నెంచి యి, త్తెఱఁగున వేఁడుచుంటి భవదీయకృతివ్రజమం
దు నత్ప్రథా, కిరదకలంకసంఘటితగీరతముం బరికింప వేంకటే, శ్వరకవివ
ర్య! మీకృతులు సర్వముఁ జూడఁగ వేడ్క యయ్యెడిన్.

ఇట్లు ఆకొండి వెంకటశాస్త్రి
బొబ్బిలి సంస్కృతపాఠశాలాపండితుఁడు.

---

పదునెన్మిదవనాఁటి పదునుపాఁటునిబారి కెదఁగొంకి పాఱఁడే కృష్ణుఁ డటకొ,
సైంధవవధకు నాచార్యు ద్రొక్కింపఁడే శ్రీకృష్ణుఁ డా నాఁడు క్రీడిచేత,
తే॥గీ॥ నిజముగానాకుసామ్యంబునీదుకావ, మఱఁదికృష్ణునకున్నసమ్మోహితుగుణము,
కూడ నున్నను గీర్తి చేకూఱనీఁడు, ఎట్టులో నిన్నుఁగాపాడి యేమిఫలము.

---

......ఆ. వి. పి, సంతోష పూర్వకముగా 1-8-0 చెల్లించి పుచ్చుకొని గీరతంబ దివి పరమానందమును పొందినాను. రెండవ భాగముకూడా త్వరలో అచ్చువే యించి పంపించ గలందులకు కోరుచున్నాను. మ॥ రా॥ శ్రీ. వే॥ రా॥ గ్రంథమా లద్వితీయ గుచ్ఛకములో శృంగభంగమందు (5)వ పుట కడపటిఉత్పలం "కాము దిఁ జేతఁబట్టి"యను పద్యము మొదలు నాలుగు పద్యములు చదివినంతనే. వారివ్రా తలయందు సందేహముతో నుండిన మమ్మును మీ గీరతమువల్లను సంశయ నివృ త్తి చేసినందుకు చాలా సంతోషముగా నున్నాను.

P. Ganardanam, Naidu.
Baruva Post
Ganjam District.

---

కేశ్నకుర్తి, ముమ్మడివరం పోస్టు. ఆకొండి సుబ్రహ్మణ్యం కృతానేక నమస్కారములు.

......గీరతం అచ్చుపడినట్టుగానే పంపిస్తామని వ్రాసినారు కాబట్టి అచ్చుపడినట్టు విన్నాను:...యీ గీరతంలో సర్వాంశములున్ను వున్నవనిన్నీ బహుబాగా వు న్నదనిన్నీ, చూచినవారు చెప్పడంచేత నాకు చాలా కుతూహలంగావుండి యీ వుత్తరం వ్రాసినాను గాన ముఖ్యముగా పంపించకోరుతాను.

ది14-10-12. అ॥ సుబ్రహ్మణ్యం.

---

Nuzvid. 28-7-1912

......గీరతము ఇప్పటివరకు కొంతచదివితిని. యింతవరకు నాకు తీసివేయవలసి నపద్య మొకటియు కనుపడలేదు. ఇది నాయొక్క నిశ్చయమైన యభిప్రాయ ము. (తమయొక్క) గీరతములో 34వ పేజీలో "కృతి" యన్న కంద పద్యము లో వ్రాసపోయినటులు నాకుతోచినది.

నారయ్యప్పారావు

సీ॥ సకలాగమాంతసంచారి యాకృష్ణుండు సకలాగమాంతసంచారి యితఁడు,
పరమ సత్యాసక్త భావుఁ డాకృష్ణుండు పరమ సత్యాసక్త భావుఁ డితఁడు,
గాంగేయగౌరవాక్రాంతుఁడా కృష్ణుండు గాంగేయగౌరవాక్రాంతుఁ డితఁడు
పూతనానాశనస్ఫీతుఁ డాకృష్ణుండు పూతనానాశనస్ఫీతుఁ డితఁడు.

---

అయ్యా! 12-7-12, చిత్రాడ.

తమరు పంపించిన గీరతము అందినది. గ్రంథంబు చదివినకొలది మాయుల్లంబు తరిమితానందవార్ధిఁ దేలుచుండె, పంచమవేదం బనంబడు భారతంబురీతి మీగీరత పుస్తకంబు పెక్కునీతులచే విరాజిల్లుచుండె. తక్కిన భాగంబులుకూడ అచ్చుపడిన వెంటనే పంపించగోరెదను. తమరు కావించిన శతావధానగ్రంథములన్నియు వి. పి. గా పంపించకోరెదను. ఇట్లువిధేయుడు

చెలికాని, లచ్చారావు.

12-1-1911, Bezvada.

శా॥ అయ్యా! మీరగు శిష్యకోటికిఁ బ్రశిష్యప్రాయుఁడౌ వీరమ, ల్లయ్యాఖ్యుండు పచించు విన్నపము మీయాంతర్యమందుం గొనుం, డయ్యా! యీయన మానకక్ష తమబోంట్లా పూనుటె? టారామర్శ్య, ష్ణయ్యల్ పిన్నలు సర్వధర్మముల, మీరైనన్ గృపన్ మానుఁడీ. ఉ॥ వారలతప్పు తొల్తగురువర్యుల నెన్నకయుంట పిమ్మటన్, దూఱుట; రెంటిలో మొదటి దోసము తప్పని వారెయొప్పిరా?, వేఱొకదోసమో? తమరు వేసము పోషణ సేసికొంటకా, దారినిఁ బోయిరందులకుఁ బగ్గ చివాట్లిడిరంత చాలదే. తే॥ గీ॥ చాలు మూలయుఁ దగు ప్రమాణాలు లేని వ్యాసములమీఁద ద్వైపాయనార్యుఁ డటు వి, మర్శనము సేయుచున్నాఁడు మర లమీరు, తగువిధమున శాంతింపుఁడు దయవహించి క॥ అత్తఱి వారిచ్చిన ప్రత్యుత్తరమును జూచువార లూహింపరె మీ, చిత్తమునకుఁ దోఁచదె! యీ, పొత్తమునమ్మనుచును భూసుతు లీరల్. ఇట్లువిన్నవించు భవద్విధేయుఁడు,

కాశీనాథుని, వీరమల్లయ్య.

తే॥గీ॥ అర్థభేదము న్మదకర్ట లేదతనికితని, కెండు శబ్దంబు లొకగతినే పొసంగు,
నేర్చికొను మాతనిగొనాలు నీకు నిమా వ, రంబులఁ బ్రతిష్ఠ కభ్యంతరంబులేదు,

క॥ గోవర్ధనుఁ డాతం డా, గోవర్ధనుఁ డితఁడు వీని కుచ్చితమే ని,
న్నీవిధిఁ దీర్చెఁదప్పదు, శ్రోతలు నీవింత మనసు పెట్టుంగ వెలుఁగుదురా.

---

31-1-1911, గుంటూరు.

శుభము.

(1)...క॥ శ్రీతిరుపతి వేంకటకవి, భూతేశులు వినుఁడు నాయపూర్వపు మనవిన్, మీ తెలుఁగు గీరతమ్మొకఁ, డీతటి నాకందఁజేయుఁడీ వీ, పీ, గాన్. క॥ అప్పటికాభారతమిఁక, నిప్పటి కీగీరతంబు నెన్నోవిషయాల్, సెప్పఁగ వెలువడెనని మొద, లెప్పుడు మాతునె యటంచు నేననుకొందున్. క॥ మీరురచించిన రూతక, భారతభాగములఁ గాంచి ప్రజ మెచ్చెఁగదా, గీరతము నెల్లగాంచును, యారయ మీకవన మెప్పు డనదృశమొకదా. ఉ॥ తొలుతటినుండి, తెల్గనినదూరముగాఁ జనువారు గూడ మీ, తెలుఁగుఁ బ్రబంధముల్ చదివి, దివ్యతరంబగు తెల్విఁ గాంచి వే, కలగతిఁ [illegible]గబ్బముల నల్పఁగ సాగిరి కీలెతింగి లో, కులకెటు వంటి మేలు నథమూర్చెడివో కనుఁడీ భవత్కృతుల్. ఉ॥ ఎంతటి యూహ లేని లగియింపఁగ జేయుచుఁ బద్యమందుఁ గొం, డంతలు భావముల్ విలువు పట్టినదంబులఁ గూర్చుచున్ గవి, త్వాంతము సాహితీపద్ధతి నందిరచించి కృతుల్ బథానముల్. వింతగఁ జేసి మీరు ప్రతిలేని యశంబును గంటి రివ్వరున్.

(2)...గీరతము కడపటిదాఁకఁ జూచితిని సక్రమము. సధర్మము. ససందర్భమునై యున్నది. భారాపస్వరస్యదులకు మెచ్చనివారు ముందుపుట్టవలెను.

ఇట్లు శిష్టా మానుమచ్చాస్త్రి. గుంటూరు.
తెల్గుపండితుఁడు, టౌను హైస్కూల్.

---

(1)...గీ॥ మీ కవిత్వమునన్ ఇసుము మిన్నగునఁటే? బహుకవులచేత పన్నుతుల్ బడసినదఁటే? వికృతులం గూడ సంతోషపలచినదఁటే? భారతమునకుఁ బ్రియసుగీరతంబు

(2).....మీరంపిన గీరతమందినది. దానిని సమగ్రముగా జూచినాను. వేంకటరా

ఉ॥ ద్రావిడులందు మూఁగురుగదా! గుణవంతులు, నేను బావయున్
సీవును నద్దుకొందము "మనీషులు నవ్వెడికూళ" తిర్పతిన్
జేవయెటుల్ ఘటించు! గురుశిష్యవినోదము లింత చక్కఁగా
నావలె నీవలెన్ దెలియునా! వెలనాఁటిశతావధానికిన్. ౨౦౮

---

మ కృష్ణకవులు పాండిత్య మెట్లున్నను అత్యద్భుత బిరుదుపొందిన వారఁట! అట్టి వారికి శృంగభంగములు వ్రాయుట లెక్కలోనిది కాదు, మీగీరతమందు మాకు తెలిసిన విషయములు వారివిషయమై వినుందు. (1) గురువును మఱచుట. (2) రిజష్టరుత్తరంతిప్పివేయుట. (3) చాటువ పద్యములల్లుట, (4) వ్రాసినమాటకుబదులు వ్రాయకుండుట (5) శృంగభంగములు వ్రాయుట, మొదలయినవి గ్రహించితిమి. మార్గముఁజూపినను తెలిసికొనలేనివారితో నేమి సార్థకము.

చ॥ తిరుపతి మార్గ మిట్టిదని తెల్పఁగ వేంకట నాయకుండు త। ద్గిరివర మెక్కినాఁడిది యొగిన్ గనినారు సువర్వముఖ్యు లీ । తిరుపతి మార్గమిట్టిదని తెల్పితి వేంకటశాస్త్రివీవు త । త్పురుషులు గాంచినా రిది కుబుద్ధులు వారలు గాంచ నేర్తురే.

వీరు శృంగభంగములు వ్రాయుటయు, తక్కంగల్గు పండితమ్మన్యులుమీపైకివివాదమునకు గాల్దువ్వుటయు చూడ మీకవితావనితా శుభసూదకము స్ఫురించుచున్నది. యెట్లన.

ఉ॥ క్షోణిజనమ్ము లందఱు విశుద్ధగతిన్ జరుపంగ "నిత్యక, ల్యాణముఁ బచ్చ తోరణము హాయిగ వెంకటనాథుఁ డందె మీ, రాణిసుకీర్తి సాధ్వియ దిరాపిడిచేసిన రాదు. నిత్యక. ల్యాణముఁ బచ్చతోరణము హా యిటమీర్గొనినా రదానిచే: తెలికేపల్లి, రామచంద్రయ్య, వేలూరు, చిలకలూరిపేటపోస్టు.

......సీ॥ కావ్యముల్ ల్పనుకూర్చి వలు పాత్రములొనర్చి వఱలు శ్రీశంకర గురులుదక్క. వేదాల వివరించివేనవేల్గ్రంథమ్ములొప్పనువు విద్యారణ్యమునులు దక్క, ఎనుబదికావ్యంబు లొనరించి శివభక్తవతియైనయప్పదీక్షితులు దక్క. తమి నూటనాల్గు కబ్బములల్లి కృతియైన నీలకంఠాచార్య మౌళిదక్క, తే॥గీ॥భూమినెవ్వైనసిన్నియా పుస్తకములఁ, జారుకవితరచించిరేమీరుదక్క, చెళ్లపిళ్లకులాంభోధి శీతపాద, సద్విసుత బోధ వేంకటశాస్త్రిబిబుధ....ఉ॥ గీరతమన్న సర్వగుణ కీలి

శా॥ శ్రీకృష్ణుం డుదయించు హేతువున సుశ్రీమించె రేపల్లె. నీ
యా కృష్ణుం డుదయించు హేతువున నో! యాకారవల్లీ సమా
ఖ్యాక గ్రామము దుర్యశోభ్య దయ పారావారముల్ దాఁటలే
కే కాకారతఁ గుందుచుండెఁ గనుఁ గొంటే శిష్యచూడామణీ.

---

తమూర్జిత పాకసారము, వ్వారిగఁ జూచిదానిత్రితివర్ణ నరద్రసపూరమానఁద,ద్భారతవైఖరిం దెగడెఁ దక్కినభాగము లన్ని పూర్తిగాఁ,గూరిచివేగ మంపుఁడిది గోరెదఁ దిర్పతి వేంకటేశ్వరా.  8-11-12, సోమవారం, గుంటుపల్లి, గోపాలకృష్ణయ్య.

---

ది 4-8-12 సం॥ కాకరపర్తి.

అయ్యా!!

తమరు చేసినగీరతము చాలాబాగావున్నదనిన్ని, మిక్కిలి రసవంతముగా వున్నదనిన్ని, మీవాక్కు అనేసరస్వతికి ఈగ్రంథము ముఖ్యస్థానమనిన్ని వింటిని.

చర్ల సూర్యనారాయణవ్రాలు.

ది 30-8-12 యింజరం.

...... త్రివిధ నీతిదాయకంబగుచు సరసపద భూయిష్ఠంబగు మీగీరతమున మొదటిభాగమును జూచితిని అందు మీరు మీశిష్యులను మందలించి నయమార్గంబు లంగనుపుటకై ప్రయత్నించినయంశములు పెక్కు లున్నవి. కొమరుం డెన్నియ కృత్యము లొనరించినను జనకుండవియన్నియు సహించి యూరకుండు నటుల మీశిష్యులు మీపై యెన్నివ్రాతలు వ్రాసినను మీయశస్సునకు భంగము కలుగ నేరదు. యిదియంతయు దెలియునటుల గీరతము భారతమంత గ్రంథముగా వ్రాయుచుండిరి. యియ్యది జూడంజూడ పిచ్చుకపై బ్రహ్మాస్త్ర ప్రయోగమువలె గన్పట్టుచున్నది. యెవ్వరి శక్తిసామర్థ్యంబు లెట్టివియో సుధీవరు లెఱింగిన విషయమే! మీకు దెల్పునంతటి సమర్థుండను గాకపోయినను గీరతంబింతతో విరమింప బ్రార్థించు నన్ను మన్నింతురుగాక. గీరతం పూర్తిఅయిన వెంటనే ఒకటి నాకు వి, పి. గా బంపబ్రార్థించుచున్నాఁడను

పాలగ్రాముచింతామణివ్రాలు.

ఉ॥ కాంకరవర్తి లేఖలనుగాంచి సహత్తర మేదిలేమి వా
ర్నాకు సమీప బంధు లనినన్ జగమొప్పెడి నంచు నెంచియా
సాంకుస దూరదేశగత సజ్జనులన్ గికురింత నెంచెదే?
యీకపటంబు కృష్ణకవిదే యగునో? మఱి నీదిరూపిషుతా. ౨౧౦

---

(1)...ఇక్కాలమహిమ కనుకూలముగ తమచే వక్కాణింపబడి భారతమునకు బదులుగ వర్తించు గీరతమునే చదువవలయునను పెక్కండ్రు చదువర్లు నొక్కివక్కాణింపు వాక్యంబులను విని నేనువ్రాసుకునే మనవియేమనగా...గీరతము 1 ప్రతిన్ని...ఈ నాల్గుప్రతులు వీ. పీ. గా పంపవలయునని నిత్యము నమస్కరింపుచున్నాను.

(2)...అయ్యా తమరు రచించిన గీరతము, శ్రవణానందము, తమ కరుణవలన యిప్పటికి 2 పుస్తకములు ఆసాంతము చదివితిని శ్రవణానందము జారులపాలిటి ఫిరంగివలెనే నిత్యానందము నొసగుచున్నది. గీరతామ్నాయము కడవరకు చదివినాను. యియ్యది. కలియుగ భారతమనుటకు యేమిన్నీ సందియము లేదాయెను. కుంతీకుమారుల బైకొనిన దుర్యోధనుని మాదిర్కి తమపై రామకృష్ణకవుల ప్రల్లదములు గాన్పించుచున్నవి గాని వేరొండు కాదు. అయ్యా మీగీరతమునందు రామకృష్ణుల ప్రసంగదమనసములే కాని కొవ్వరపువారివిషయములు లేవు, యీవిషయమై జరిగిన ప్రబంధమేదియైనవున్నచో వీ. పీ గా దయచేయుదురని నానమస్కారపుమనవి.

పేరేచర్ల హనుమంతరాజు వ్రాలు. ది6-9-1913
కాకాని, సంతమాగులూరు పోస్టు
నర్సారావుపేట తాలూకా, గుంటూరుజిల్లా.

---

ది13-9-10

గొల్లకోట భైరవశాస్త్రి అనేక నమస్కారములు ...యీమధ్య తమరు అచ్చువేయించిన వాదపత్రిక నాకు వినతమందు చాలాకుతూహలముగా నున్నది. పిఠాపురములో తమ పత్రికను చూచినవారు చాలా సంతోషించుచున్నారు... ...యీపత్రికయున్న పంపించితే దానిఖరీదులు దాఖలుచేస్తున్నాను.

ఇట్లు విధేయుడు గొ॥ భై॥ శాస్త్రి.

శా॥ నీమేనత్త కొమారుఁడే తెలిపె వానింగూడ నా బందు వం
చేమేనిన్ లిఖియింప నేరుతువె మీకృష్ణుండు నీతండ్రియున్
సామాన్యంబుగ నన్నదమ్ములగుటల్ సత్యంబు నందాకఁ డు
ద్దాముం డింకొకఁడో? యసత్యమున విద్వాంసుండు శిష్యాగ్రణీ. ౨౧౧

---

......ఉ॥ వింటిని గీరతమ్మును వేదమయానని ధర్మబోధయం, దుంటిని పప్పుటెప్పాయని యిటా గురుశేఖర! గీరతమ్ము నే, డంటిని వేదమే యనుచు నాగ నిరాకరనవిత్ కవీంద్ర! వా, కొంటిని వీ. పి. గా నొకటి కోరిక నా కొకఁడంప మిమ్ములన్.

ఇట్లు శిష్టావధానుల శాస్త్రులవారి శిష్యుఁడు
మంత్రాల కామేశ్వరరావు.

---

......శ్లో॥ శ్రీమద్వేంకట రామకృష్ణకవిభి ర్విఖ్యాతలీలాత్మకో, యుష్మద్గ్రంథవిదూషణాత్మకతయా గ్రంథస్తు రిటా నిర్మితః,దృష్ట్వాతం బహుధావినిశ్చితధియా మస్మిన్ప్రజానాంచ శృత్వా కించిదపి, ప్రవృత్తిమలనప్పద్గీరతాదర్శనాత్॥
శ్లో॥ యుష్మన్నిరాఘాట కవిత్వధాటీ, సముత్థితాఖండయశోఝురీంతాం, సథాగురి స్తారయితుం మనోమే,నిరీక్షితుం కాంక్షతి గీరతంచ॥

ఇట్లు,తమవిధేయుడు, మేడవరం సుబ్రహ్మణ్యశాస్త్రి.
కర్నూల్ జిల్లా, మార్కాపురం తాలూకా, యెర్రగొండపాలెం.

---

శ్రీ...తమ గీరతామ్నాయము అనేకమార్లు నేను చదివియున్నాను. దానిశైలియిట్టిదని వర్ణించుటకు తగినంత సామర్థ్యం భగవంతుడు యివ్వలేదు...పెండ్లిపర్వములో మాసూర్యనారాయణశాస్త్రులను నాటి అల్లరికి అంతకీ కారకుడుగా వ్రాయించినారు, ఆది అన్యాయమని నేను దలచుచుంటిని అతడు వెంకట్రామయ్యవలె తమకు చిరకాలపు శిష్యుడు కాకపోయినను మా రామకృష్ణమ్మంత శిష్యుడు కాకపోడు, వీరుభయులున్నూ మీయందున, మీకవిత్వమందున. విశేషమైన భక్తికలవారైనను, మాపెత్తండ్రిగారి అబ్బాయి యిటీవల భక్తిలేనివాడుగా మీకు కనుపించుచున్నాడు. అతనిని గురించి నేను వ్రాసినను వీలులేదుగాని నిజానికి అంతరంగము నందు మీరన్నా, మీకవిత్వమన్నా, ఇప్పటికిన్నీ భక్తికలవా

ఉ॥ వేదుల రామకృష్ణునకు వేదులవారును జర్లకున్ స్వదా
యాదులునున్ విరుద్ధులయి యగ్గకొనిసత్యము తెల్పఁ బూను టు
న్మాదము పుట్టిగా దది ప్రమాదములోఁ బడు వాఁడబెట్టి దు
ర్వాదము చేయు టొప్పదని వారు తలంచుట సుమ్మి పుత్రకా. ౨౧౨

చ॥ ఒకఁ డెవఁడో వివేకవిరహుండు దుడయించిన నంతమాత్రి న
త్ప్రకరవరఁవరా జనివదాంబులు వంశముల ప్రతిష్ఠచేఁ
గకవిక గాంచఁ బోవనుచు గట్టిగ చాటుట కున్నమాట వా
రకుటిల చిత్తులై దెలిపి రంచు జగంబు గ్రహించుఁ గావుతన్. ౨౧౩

---

దేఅని నేనే కాక మాగ్రామమంతా కూడా యెరిగిన సంగతియే, మాసూర్యనారాయణశాస్త్రిగారూ మీవిషయమై యెప్పుడుగాని, యేవిధమైన చెడుప్రసంగము చేసినవాడు కాడు. యితనిని శృంగభంగంలో సీసపద్యంలో సాక్షిగా వేసుకున్నను సమయంవస్తే నిజంచెప్పేవాడే కాని వేరు మోస్తరువాడు కాడు, యితడే కాదు వాళ్లువ్రాసిన సాక్షులంతా ప్రమేయంవస్తే, ఆవేళను జరిగిన పని తప్పదునని అనిన్నీ దానికి ముఖ్యకారకులు మారామకృష్ణమ్మ మాట అటుండగా, శ్రీవ్యాసమూర్తి శాస్త్రులు గారి తమ్ముడువల్లనే అనిమాగ్రామంలో చెప్పనివారు వకరూరువుండరు. యిట్టిస్థితిలో మాసూర్యనారాయణశాస్త్రి ముఖ్యకారకుడు అని తాము అభిప్రాయపడుట ఆతనికిన్నీ నాకున్నూ చాలావిచారముగానున్నది. యీసంగతి ఆతడు చాలాసార్లు నాతో ముచ్చటించినాడు. శృంగభంగము తప్పుడుకూతలు అయినప్పటికిన్నీ ఆతను అచ్చునకు తీసుకొనివెళ్లుట, అనాలోచన పనిగా తమరు నమ్మవలెను, ఇటీవలఅవధానములలో తమరినిగురుస్తుతిగా నుతించినాడు. ఆపద్యము నాతో చాలాసార్లు వినమని చెప్పినాడు. ఆపద్యములు ముందు అచ్చులోనున్నవి. చూడగలరు, ఆరెండవనాటి అల్లరిసభలో కాకరపర్తి వెంకటశాస్త్రియున్నూ, నారాయణ శాస్త్రిగారున్నూ, వీరికి సంబంధించినవారున్నూ కాక మిగతా వారీయుద్దేశం కలవారు కారు. మీరుమాత్రం అప్పుడు అంతాదురుద్దేశం కలవారనే అని అనుకొనియుందురు, యిటీవల సత్యనిర్ధారణకు తోడ్పడినవాళ్లను తప్పించుటచే మాకాయర్థము స్పష్టమవుచున్నది. మాసూర్యనారాయణశాస్త్రి అల్లాతోడ్పడకున్నప్పటికి దురుద్దేశము కలవడు కాడు, యితడు మీగీరతంరాకపై యెదురుచూచుచు నన్ను ప్రతిరోజున్నూ అడుగుచుండేవాడు, వచ్చినతరు

శా॥ నీమేనత్త కొమారుఁడే తెలిపె వానింగూడ నా బందు వం
చేమేనిఁ లిఖియింప నేరతువె మీ కృష్ణుండు నీతండునుఁ
సామాన్యంబుగ నన్నదమ్ములగుటుల్ సత్యంబు నందాకఁడు
ద్దామం డింకొకఁడో? యనత్యమున విద్వాంసుండు శిష్యాగ్రణీ. ౨౧౧

---

......ఉ॥ వింటిని గీరతమ్మును వేదమెయానని ధర్మబోధయం, దుంటిని వచ్చుటెట్టాయని రామా గురుశేఖర! గీరతమ్మనే, డంటిని వేదమే యనుచు నాగ నిరాకరణవిత్ కవీంద్ర! వా, కొంటిని వీ. పి. గా నొకటి కోరిక నా కొకఁడంప మిమ్ముల౯.

ఇట్లు శిష్టావధానుమల్ శాస్త్రులవారి శిష్యుఁడు
మంత్రాల కామేశ్వరరావు.

---

......శ్లో॥ శ్రీమద్వేంకట రామకృష్ణకవిభి ర్నిత్యాపలాపాత్మకో, యుష్మద్గ్రంథవిదూషణాత్మకతయా గ్రంథస్తు రామా నిర్మితః, దృష్ట్వాతం బహుధావినిశ్చితధియా మస్మిన్ప్రజానాంచ శ్రుత్వా కించిదపి, ప్రవృత్తమలనస్త్వద్గీరతాదర్శనాత్॥
శ్లో॥ యుష్మన్నిరాఘాట కవిత్వధాటీ, సముత్థితాఖండయశోర్ఘురీంతాం, సభాసు విస్తారయితుం మనోమే, నిరీక్షితుం కాంక్షతి గీరతంచ॥

ఇట్లు, తమవిధేయుడు, మేడవరం సుబ్రహ్మణ్యశాస్త్రి.
కర్నూల్ జిల్లా, మార్కాపురం తాలూకా, మొర్రగొండపాలెం.

---

శ్రీ...తమ గీరతామ్నాయము అనేకమార్లు నేను చదివియున్నాను. దానిశైలియిట్టిదని వర్ణించుటకు తగినంత సామర్థ్యం భగవంతుడు యివ్వలేదు... చెప్పట్లపర్వములో మా సూర్యనారాయణశాస్త్రులను నాటి అల్లరికి అంతకీ కారకుడుగా వ్రాయించినారు, అది అన్యాయమని నేను దలచుచుంటిని అతడు వెంకట్రామయ్యవలె తమకు చిరకాలపు శిష్యుడు కాకపోయినను మా రామకృష్ణమ్మంత శిష్యుడు కాకపోడు, వీరుభయులున్నూ మీయందున, మీకవిత్వమందున. విశేషమైన భక్తికలవారైనను, మా పెత్తండ్రిగారి అబ్బాయి యిటీవల భక్తిలేనివాడుగా మీకు కనుపించుచున్నాడు. అతనిని గురించి నేను వ్రాసినను వీలులేదుగాని నిజానికి అంతరంగము నందు మీరన్నా, మీకవిత్వమన్నా, ఇప్పటికిన్నీ భక్తికలవా

ఉ॥ వేదుల రామకృష్ణునకు వేదులవారును జర్లకున్ స్వదా
యాదులునున్ విరుద్ధులయి యగ్భకిసత్యము తెల్పఁ బూను టు
న్మాదము పుట్టికాదది ప్రమాదములోఁ బడు వారిఁబట్టి దు
ర్వాదము చేయు టొప్పదని వారు తలంచుట సుమ్ము పుత్రకా. ౨౧౨

చ॥ ఒకఁ డెవఁడో వివేకవిరహుం డుదయించిన నంతమాత్ర స
త్ప్రకరవరంపరా జనివదంబులు వంశముల ప్రతిష్ఠ చేఁ
గకవిక గాంచఁ బోవనుచు గట్టిగ చాటుట కున్నమాట వా
రకుటిల చిత్తులై దెలిపి రంచు జగంబు గ్రహించుఁ గావుతన్. ౨౧౩

---

డేఅని నేనేకాక మాగ్రామమంతా కూడా యెరిగిన సంగతియే, మాసూర్యనారాయణశాస్త్రికెపుడూ మీవిషయమై యెవ్వడుగాని, యేవిధమైన చెడుప్రసంగము చేసినవాడు కాడు. యితనిని శృంగభంగంలో సీసపద్యంలో సాక్షిగా వేసుకున్నను సమయంవస్తే నిజంచెప్పేవాడే కాని వేరు మోస్తరువాడు కాడు, యితడేకాదు వాళ్లువ్రాసిన సాక్షులంతా ప్రమేయంవస్తే, ఆవేళను జరిగిన పని తప్పుడుపని అనిన్నీ దానికి ముఖ్యకారకులు మారామకృష్ణమ్మ మాట అటుండగా, ఆవ్యాసమూర్తి శాస్త్రులు గారి తమ్ముడువల్లనే అనిమాగ్రామంలో చెప్పనివారు వకరూరువుండరు. యిట్టిస్థితిలో మాసూర్యనారాయణశాస్త్రి ముఖ్యకారకుడు అని తాము అభిప్రాయపడుట అతనికిన్నీ నాకున్నూ చాలావిచారముగానున్నది. యీసంగతి అతడు చాలాసార్లు నాతో ముచ్చటించినాడు. శృంగభంగము తప్పుడుకూతలు అయినప్పటికిన్నీ అతడు అచ్చునకు తీసుకొనివెళ్లుట, ఆనాలోచన పనిగా తమకు నమ్మవలెను, ఇటీవలఅవధానములలో తమరిని గురుస్తుతిగా నుతించినాడు. ఆపద్యము నాతో చాలాసార్లు వినమని చెప్పినాడు. ఆపద్యములు ముందు అచ్చులో నున్నవి. చూడగలరు, ఆరెండవనాటి అల్లరిసభలో కాకరపర్తి వెంకటశాస్త్రియున్నూ; నారాయణశాస్త్రిగారున్నూ, వీరికి సంబంధించినవారున్నూ కాక మిగతా వారీయుద్దేశం కలవారు కారు. మీకుమాత్రం అప్పుడు అంతాదురుద్దేశం కలవారనే అని అనుకొనియుందురు, యిటీవల సత్యనిర్ధారణకు తోడ్పడినవాళ్లను తప్పించుటచే మాకాయర్థము స్పష్టమవుచున్నది. మాసూర్యనారాయణశాస్త్రి అల్లరితోడ్పడకున్నప్పటికి దురుద్దేశము కలవడు కాడు, యితడు మీగీరతంరాకకై యెదురుచూచుచు నన్ను ప్రతిరోజున్నూ అడుగుచుండేవాడు, వచ్చినతరు

ఉ॥ పుట్టిన దుత్తమాన్వయము పోయి వసించినచోటు ధర్మపుం
బట్టము పీఠికాపురము, పార్థివుఁడో యలధర్మరాజె నీ
కిట్టిదురూహ పుట్టుటకు హేతువు గానఁగలేక సారెకుఁ
గట్టితి నిన్ను తద్దయు లఖండయశమ్మును నీకొసంగితిన్. ౨౧౭

ఉ॥ ఎంతటివాఁడొ? శిష్యుఁడవఁడెంతటివాఁడును గాఁడయేని దు
ర్దాంతుఁడు వేంకటేశ్వరుఁడు "తన్నుఁ దలంతు" రటంచు నిట్టిగాఁ
జింత వహించునే? మఱియుఁ జెప్పెనె భారతమంత గ్రంథ"మం
చెంతురు లోకు లెట్లయిన నేమి కృతార్థుఁడ వైతి తర్పకా. ౨౧౮

ఉ॥ ఎందఱు శిష్యులో కడు నహీనునిగా ననుఁ గొల్చుచుండ నీ
యందునె పట్టు పట్టుటది యారయ నీదుపురాకృతంపుభా
గ్యం బిది కాక యిందునకు హేతువు గల్గునె? ధన్యమూర్తి వీ
వందఱు శిష్యులందునను తర్పక! నందియ మిందులేదు సూ ౨౧౯

---

...బ్రహ్మానందశాస్త్రి వ్రాసినట్టుగా మాగ్రామములో కొంతమంది కోతిమూక యున్నది ...పుంగవుల కొరకు గుంటూరులో మూడుమాసములు వసించిన మీరు మాగ్రామములో రెండురోజులైనను వసించినయెడల మీవైరులెంతగంభీరులో తెలియకపోవునా, దర్లదలవతి వ్రాసిన క్షమాపణ పత్త్రంవల్లనే తమకు గోచరించియుండవచ్చును....పిడుగువంటిది తిరుపతిశాస్త్రిగారి పత్త్రం వచ్చినతోడనే అతనికేకాదు ఆపక్షములో పెద్దతలకాయలకును గుండెజలజలమనెను...మీథాటికి వారెవరు, వీరెందులోవారు. మహాగజాశిశులాయంతే మశకానాంతుకాకథా, యిదివిప్పుకపై వ్రాయుధ మన్నట్లున్నది, అయిన యిది ఒకమిషచేసికొని మీరు మావోట్లందరికి గురుశిష్య ధర్మాలను. ఉపదేశించుటచే లోకోపకారమని చాలామంది పెద్దలెల్లరు సుదుతగా సేసుకొన్నారు. మీగీరతమును జూచి నారాయణశాస్త్రిగారు సూర్యనారాయణశాస్త్రితో నిన్ను కారకునిగా వ్రాసినారు. గాని యింతచేసిన మమ్మ రేమియు మాతృద్రోహ వ్రాయనేలేదుగదా, బాగుగానున్నదే అని వకనాడు అనిరున్నారు,...రెండవ పుస్తకములో సూర్యనారాయణశాస్త్రిని తప్పక నిరపరాధినిగా వచరణచేస్తారని నానమ్మకము, యివియే అనేక నమస్కారములు. సామవేద్ల సూర్యనారాయణావధానులు వ్రాలు.

సాకిన్ కాకరపర్రు

ఉ॥ "శృంగవు భంగముగా" గని యునీ? యని కొందఱు రాజ మూ ఖ లీ
వెంగలి వ్రాఁత వ్రాసిన ప్రవీణుల ప్రజ్ఞను నత్సభా ముఖా
శృంగమునందుఁ జూత మని జాబును మీకు లిఖింప నెంచి న
న్నుం గని పల్కు వారల ననుంగుల నేను మరల్చితిం జుమీ. ౨౧౯

## (9) సంకీర్ణ పర్వము.

ఉ॥ * పావము? వా రెఱుంగుదురె పాండితి నీయది, పత్తు వంచు ని
న్నోపికఁ బిల్వ నెంచి రెటులో పికరి యీ పోకసాకు వన్ని యా
భూపులఁ జిన్నఁబుచ్చె దవు పొచ్చెము వన్నుట కీవు నేరవే,
దాపున బావ లేఁడె యిది తప్పులు దక్కు జగం బెఱుంగునే. ౨౨౦

### క్షేమము, ఆశీర్వదనములు.

మీరు మాఊరు వచ్చినప్పుడు ఇంకా వుంటారుకదా అనుకొన్నాము. వెంటనే వెళ్లిపోయినారు. మీరు యెంతగొప్పవారయినను బంధువులను అనాదరించడము న్యాయముకాదు మావూళ్లో యెవళ్లో అల్లరిజేసినారని మేమంతా దానిలో వాళ్లమే అని వూహించి మామీద శీతకన్నేయుట ధర్మముకాదు. రామకిష్టమ్మ వ్రాసిన తప్పదువ్రాతకు మావూళ్లో పెద్దలెవ్వరూ వార్షించడములేదు. రామకిష్టమ్మ తండ్రిగారు కూడా కొడుకుచేసినతప్పునకి చాలా నొచ్చుకోవడము నేనువినియున్నాను. తండ్రే నొచ్చుకోనప్పుడు యితరులు నొచ్చుకొంటారని మీరాలోచించడము తప్పు, అనిమళ్ల సీతారామశాస్త్రిలు వగైరాలు మీరు వెళ్లినతరువాత రామకిష్టమ్మ వగైరాలను చాలామందలించినారు. గ్రామానికి అప్రతిష్ట తెచ్చేపనులు పెద్దలెవ్వరూ సమ్మతించరు. నేనుచదువకపోయినా మీకుమీకు వుండె తేడాపాడాలు యెరుగనివాడనుకాను. తాతపూడి భానప్పవ్రాలు.

* వుత్తరం...శ్రీశ్రీ... లు.. చిత్తగించినారు, యింతమాత్రము చేతను వారి మనస్సుకు తృప్తిగాలేదు,... సభచేయించి తగుపండితులను ఆహ్వానంచేసెదము సన్నిధుభయపార్టీలకు పక్షీకవుత్తరములు వ్రాయించెదమనిన్నీ యీవుత్తరం అందినతోడనే ఒకరోజుకాలువ్వవుచ్చుకొని రావలశినదిగా కోరుచుచ్చినట్లున విన్నవించెదను. ది 11—8—11 (చేబ్రోలు)

ఉ॥ కోయిలయెల్లకాల మొకకోటరమందె వసింప దాక్కుఁబో
తీయని మావిగున్ననెగతిం దలపోయదు మావిగున్నలం
దేయెడ సంచరించు టది యెవ్వ రెఱుంగరె? యొక్కసారి పైఁ,
బోయి స్వశక్తిపక్షతులు పొంపిరివో విహరింపు మర్భకా ౨౨౧

ఉ॥ కాకులబాధ బాల్యమునఁ గాని యనంతరమందు నుండ దీ
పాక్షము నీవెఱుంగవొకొ? ప్రౌఢత గల్గిన కోకిలంబు తో
డీకొనవెందుఁ గాకములు డేకకు మూలల, సత్సభాస్థలిన్
బ్రాకటశక్తిఁ జూపుము ప్రపంచక మెల్ల నిజం బెఱింగెడిన్. ౨౨౨

ఉ॥ అల్లెదు పద్దెముల్, సరిగ నయ్యది యుండెడి, వందియంబు లే
దల్లెడినంతనే జగము లల్లన మెచ్చునె? యెన్నిశక్తులో
కల్లవితంబులైనయెడఁ బ్రాజ్ఞులు మెచ్చెద రప్పుగూడఁ గీ
ర్త్యుల్లసనంబు దుర్లభము రూపిక? యోపికనెంచి చూడుమా? ౨౨౩

ఉ॥ నిద్దుర పోవుమోము, గణనీయము గాని గళంబు, మేటియా
పద్దశ దెల్పుధార, విన వాంఛ జనింపనివాక్కు, గాక యే
విద్దియ గాని నేర్పినవివేకులు సత్సభలో నివారలన్
దద్దయు మెచ్చఁ జేతు రని దజ్ఞులు దెల్పుదు రీవెఱుంగవే. ౨౨౪

ఉ॥ పెద్దలు వచ్చునప్పుడది బిట్టుగ విస్మృత మాశరీరమున్
గద్దటిమూఁకఁ జూచునెడఁ గంకెదు వెంకెతనమ్ము వాక్కులం
బెద్దటి కంబుఁ బ్రౌఢిమయుఁ బెక్కుగుణమ్ములు వొల్పుజాణయే
తద్దఁ బ్రపంచపున్నతికిఁ దాఁ దగు నన్య లనర్హులే సుమీ. ౨౨౫

ఉ॥ వెంకెదుఁ బెంకె పెద్దకును బెద్దగ నెవ్వఁడు సంచరించునో
లంకకు వాఁడు వోయినను లక్ష్యము లేక జయించి వచ్చు ని
శ్శంకుని నాంజనేయు నిట సాక్షిగఁ గైకొను మాతఁ డెంతయో
వెంకె సురారికోటి యెడఁ, బృథ్వితనూజ యెడన్ వినమ్రుఁడే. ౨౨౬

ఉ॥ ఈవచియించులక్షణము లిన్నియుఁ గల్గినవార లెందఱో
భూవలయమ్మునం దొకటఁ బొల్పువహింప రొకండొ యిద్దఱో
సూవె తెలయంగ లార, లివి చెప్పెదఁ జూ శివరామునం దెటో
దైవవశమ్మునన్ బృథగఁ దజ్ఞుని వానిని దూఱు టొప్పనే. ౨౨౭

ఉ॥ మానుము సన్న్యాసాశ్రమము మానుకొలంది యశమ్ము నీకు నేఁ
జేరఁగఁ జేతు నూతన ప్రసిద్ధి ఘటిల్లుచునున్న యవ్వ డీ
వేఱొక నేల జంకెదవు? విదే యొక విద్దెగ జేసికొంటి వా
ధోరణి మేలు! మేలు! గురుద్రోహి యశమ్ము వహించి తౌ బళి ౨౨౮

మ॥ *"అవధానంబది చేయ లేదు శివరామాఖ్యుండు తద్దోషముల్
శివరామున్ గదిఁ జేసి వారి తనులన్ జేసేతఁ గావించి" రం
చు వివేకం బలరార వ్రాసితి వహో! శుంఠల్ ప్రసంగించుచు
ర్వ్యవసాయంబులు నీకు సాక్షులౌనో? నీవవ్వానికిన్ మాటెదే. ౨౨౯

చ॥ అతఁడతి ధర్మతత్పరత నాటిడి మాఁతలు నైఁచి నాఁడు ప్రా
జ్ఞత గలవాఁడవే నతనివిజ్ఞ గనుంగొను మింతయేల ధీ
యుతుఁ డతఁ డొక్క పద్దెము సొహో యని లోకము మెచ్చఁ బాడునా
చతురత నీక రాదు క్షమి సాధ్యముగా దది యెట్టిదిట్టవున్. ౨౩౦

చ॥ అతనికి నీవుఁ బోల్కి యగు నంచును దజ్ఞఁ డెవండు గాని సూ
నృతమును బాడు నేయని మనీషి తానే యని వచింపఁ బోఁడు నీ
మతుక మదెట్టిదో దెవ్వఁడును గోవిదుఁ డండనె కూడ దాకొనీ నన్
బతిమఁ డటంచు నమ్మితము ప్రాజ్ఞుల నవ్వుల మాట నేటికిన్. ౨౩౧

ఉ॥ చూడుము శక్తియున్న యెడ సూరిహితం బగు సత్పథా స్థలిన్
వాఁడె ఘనుండౌ? నీవు మతి బావయు వానినిమించుమిన్నలో?

---

(అట్టహాసమునుండి)

*......కృష్ణ—ఇప్పుడు తిరుపతి వేంకటకవులు తమపుస్తకములజోలికిపోలేఁగ లిపిప్రకటించి యమ్ముకొనుచున్న యవధానము దియేనా యేమిటి!

దేశమాత—ఔను. అదియే. మొదటినుండియుఁ బాపము! వారుదాని విష యమై చాలశ్రమ పుచ్చుకొన్నారు.

కృష్ణ—సరే! తెలిసినదిలే. శివరామశాస్త్రిగారనఁగా విరాలో మాఖ్యాన కర్తయేనా?

ఆంధ్రకేసరి—(పరిహాసించుచు) ఆఁ. ఆఁ. ఆయనయే (చెవిలో) ఇట్టు లిటులు.

రాఁడనుకోకు రాఁగలఁడు రమ్మన వచ్చెదవేని దానికిన్
గాఁడు పరాఙ్ముఖుండు సరిగా లిఖియింపుము జాబు దీనికిన్. ౨౩౨

ఉ॥ * కాఁకర పర్తి రమ్మనెదొ? కాఁకర పర్తికె వచ్చు "శృంగభం
గాకలనంబు నల్పఁగల యయ్యలు తోడుగ నీవు బావయున్
దాఁకఁగ నేర్తురే యతని; నాలుక వచ్చినయట్టులెల్ల నె
ట్లో కలహమ్ము నల్పెదరె యోగ్యులు లేరె నిజమ్ము తెల్పఁగన్. ౨౩౩

ఉ॥ మానుఁడు వ్రాఁత లింక, నవమానపు వ్రాఁతలు వ్రాయు దొంగదు
ర్మానుల నెల్లఁ బట్టుకొని రాఁ దగుశక్తిని దేవుఁ డిచ్చెఁ జూ?
సూనృత మాఁగ శక్యమె సుషుప్తిని లోకము సర్వదా కలిన్
బూనదు మేల్కొనున్ నిజము పూర్తిగఁ దా నెఱుఁగుం గ్రమమ్ముగన్. ౨౩౪

ఆ॥వె॥ శ్రీపతిర్కాధిపతులు బాబో? ప్రమాదమం, చన్న వ్రాఁత నూనియనృతకల్ప
నములు చేయుబావనాలుక కొకచంద్ర, హార మిత్తు నెదుటి కనుపఁగలవె.

చ॥ కల దొకకొంత తెల్వి, యది గాదని నేనన, నంతమాత్రచే
నిల సకలమ్ము మోనమున నే మునిఁగింపఁగ నెంచి యేవిరో

---

(తాలుకుట్టనమునుండి).

*చ॥ శివుఁడను లేక రాముఁడను చేసెద నోమటి చేయ లేను నా, కవనను చూడఁగాఁ దలఁపుగల్గిన జాబులిఖింపుఁ డూరకే, సువిసువిఁ గ్రుక్కుకొద్దెముల నూరులునవ్వ లిఖింప నేల? యే, కవిత నొ తేరగా నొకటి గల్గుటకున్ ఫలమిట్టి దౌనొకో॥ ౧॥ మ. సభకున్ రావలె నోరుఁదిప్పవలె మీసామర్థ్యముం జూపి వాగ్విభుతన్ గాంచవలెన్, వృథాగ నొక చక్రిన్ దాఁగి నానాఁటు రాసభముల్ గోఁకిన పాడు వ్రాఁతలకు చానత్వమ్ము గావించుమే, కుభయం బా? మఱిభక్తియా? యురకెటో ఘోషించులిచ్చాగతిన్॥ ౨॥ ఉ॥ వచ్చెద, రమ్మటన్న నృపవల్లభునాజ్ఞనుబొంది మీరలే, వచ్చిన నిఁ తక న్ననుకుఁ భఁ బిటు సేయుఁడు లేదయేని యే, పిచ్చినొ వెళ్లఁ గ్రిక్కుటుఁడు పెద్దలు నవ్వుచునున్నవారుమీ, కుచ్చితపుం బ్రసంగములకుం జెవియొగ్గఁడు ప్రాజ్ఞుఁ డొక్కఁడున్ (విస్తరమా గ్రంథమునందే చూడఁదగు)

*దీనింగూర్చి గుంటూరిసీమ- పూర్వరంగము, 49,50 పుటలు చూడఁదగు.

గిలుకుచుఁ *"చేటభారతము" గిరతధోరణి నద్భుతంబు నా
కృతులు ప్రచురింప నేల వినఁ గూడనిపోకలు కట్టిపెట్టుఁడీ. ౧౩౬

చ॥ తిరుపతివేంకటేశ్వరుని దిట్టుచుఁ జెప్పినయట్టిపద్దెముల్
గురుతరు నింద సల్పినను గొండొక చక్కఁగ నున్నవంచుఁ జె
ప్పిరి వినువారు, తిట్టినను చిప్పకవిత్వము కాదు గాన వా
విరి నవి ప్రైటుఁ బెట్టుఁడు ప్రవీణత కయ్యది సాక్ష్య మిచ్చెడిన్. ౧౩౭

ఉ॥ తిట్టిన నేమి సన్నుతక దేవునిఁ జేసితి వంటి? దాన నూ
దట్టుఁడవె? దేశకర్తృమును దాఁటినమేల్పద మబ్బఁ జేయునా
తిట్టులు నాకు దీవనలె తిర్పతివెంకన పేరు నాకు మున్
బెట్టిన యందు కీవు సరి పెట్టితి వంచు నుతింతు నిన్నుఁ గన్. ౧౩౮

ఉ॥ ఊరక యిచ్చినన్ గొనని యప్పనిచప్పనివాఁత లెల్ల నె
వ్వారలో "కర్బు" లిత్తు రని వారకయుప్పునఁ బ్రిప్పనేల మ
ర్వారరసప్రసారగుణ బంధుర దివ్యతరప్రబంధ సం
సారులు గందు వర్థిలుఁడు జాడ్యము మాని సుఖింపుఁ డింపుగన్ ౧౩౯

ఉ॥ బీజము లేని ప్రాఁత లవి పెంపు వహింపవు మీకు బీజ మే
రాజ ఘుటిల్లి? మీ మురక యున్న గురున్ దిగఁద్రావి తిట్టఁగా
నాజడుఁ దూరకుండక యహంకృతిఁ జూపె నటందురో? యిటే మీ
బీజము చెప్పినట్టులె వివేకులకున్ బోధకట్టెడిన్ జూఁడీ. ౧౪౦

మ॥ యతులున్ ప్రాసలు పెట్టి యెట్టులో కవిత్వాడంబరం బూని తి
ట్టితిరే యందము దాన లాభ మది యెట్లోఁ గల్గఁ గాఁ బోదు వం
దితు లాధోరణి మెచ్చుకొన్న, నల గోష్ఠిన్ సత్యవాక్చాతురీ
విరతప్రజ్ఞత చూపకున్న వితయా వేమల! చాలింపుఁడీ. ౧౪౧

సీ॥ తె॥ రాష్ట్రబంధి శతవధాని వ్రాసినట్టి,పద్యముల సారమును మదిఁ బట్టుకొల్పి
శ్రోతలకున్ రందు దేశకద్రోహచింత, కలనివోసంబు ననుకావిధరమువ్రింగు.

---

*...మనపిఠాపురపు వారు"చేటభారత" మొకటి వ్రాయుచున్నారటే...

6—2—19 సుందరరావు

*దనింయార్పి మంటూరిసీమ,పూర్వరంగము 138, 129, 140. పుటలుచూడఁదగు.

తే॥ గీ॥ ఏమిసార్థక్య సోదరా యూశ వ్రాసి, వెంటనే యేసు ఖండించి వేసినంత
సత్యకాంజయమ్మనిచ్చుయశమ్మునిచ్చు, సత్యమునఁబొమ్మమంచియశమ్ముగొమ్మ

ఉ॥ వెంకటశాస్త్రి నేరొ యవివేకులు తిట్టి రటంచుఁ గాని యే
కుంకయు సత్పథాస్థలిని గొట్టె నటంచును గాని యెవ్వఁడో
జంకక వ్రాయ నయ్యది యసత్య మటంచుఁ దలంతువంటయే
వంకయు, నమ్మచో ముద ముపారము గాంచుట చెప్పనేటికిన్. ౨౪౪

తే॥ గీ॥ శత్రునకు నేని యాతన సైఁత రాదు, పైని నంతనవడు తెంత పాతకంబు
వరమ శత్రులు గిలికెడిపాడువ్రాఁత, లౌరపుస్తక మంచువ్రాయంగఁ జనునె

తే॥గీ॥ అంతమోయింతయో యక్షరాన్యులైన, మీకుఁ బారమ్మ లేనినామీఁదనక్ష
రములె నేరని వారేమి రాఁ దలంతు, రింత మాత్రము తెలియవిఁకేమనందు.

క॥ మిమ్ముఁ బట్టి గౌవ్వరము గా, వ్రమఁబట్టియు మీరు తప్పవ్రాఁతలు గిలుకన్
శ్రమ మొకటిదక్క వెంకన, కమరు నొకో యప్రతిష్ఠ యరయుఁ డిఁకైనన్.

క॥ *బ్రహ్మాత్మ్యవములతోడన్, బ్రహ్మాండం బగులుకీర్తి బ్రబలించెడిరా
జిహ్మగులారా! మీ "యం, బ్రహ్మతకు విచారమేల తడవలెనకటా! ౨౪౮

శా॥ మీయాజ్ఞానము గౌప్రపుం దెలివియున్ మేల్గూర్చెడి న్మామ మీ
రాయాసం బడకుం డసత్యములు వ్రాయంగాఁ బ్రయత్నించకుం
డో యీశమ్యుఁడ! "వేఁడిసీళ్లకు గృహం బొక్కటియున్ గాల" దా
హా! యజ్ఞానవుటట్టహాసములకున్వ్యాపారపారీణతల్. ౨౪౯

ఆ॥ వె॥ అట్టహాసమంటి! అద్దాని నిండఁ ద, వ్వఁడు ప్రసంగమంటి! పుడమి కోఁడు
చూచియుండఁ డొక్కొ! చూచియువారింతఁ, డొక్కొ! మూఢఁడనుటె యొప్పవలయు.

ఉ॥ చూచిన సూరకుం డఁ "డిదె కుంతప్రసంగము మానుఁ" డంచు బి
ట్టేచి చివాటులన్ గొలువ దిట్లును మానఁడ ప్రాజ్ఞుఁడై యెటుల్
నీచత నమ్మతించు నతనీమతి నిక్కము చూచియుండఁ డీ
తోఁచియుఁ దోఁచ రానిమతి ద్రోవలు పోనికిఁ జూడ నేటికిన్. ౨౫౦

---

*దీనింబూర్వి వేమవరాగ్రహారశతావధానమునఁ జూడఁదగు.

గీ॥ అల్లకృష్ణుండు సంధికినంకనీక, పార్థుల వసాధ్వుల నొనర్చి బావమఱఁదు
యంచుఁ గృష్ణునిబోధల, వాలకించి, తాదృశుఁడ వీవు కావు వృథానిధనుఁగ.

ఉ॥ అన్యులతోడ మాకు నెపుడైనను వేరొకకారణమ్మునన్
జన్యము సంభవించునెడ సాయము వారల కాచరించి నీ
వు న్యశమున్ గలంచుటకు బుద్ధిని ద్రిప్పితి వెంత వెఱ్ఱివోరి
ధన్యత లేనివారలను ధన్యులఁ జేయఁగ నీకు శక్యమే. ౧౬౧

మ॥ ఒకచో గుంటురి కీవు పోఁజనుకొ పెద్దవెఱ్ఱిశిష్యుండవై శా
ఖకునై వారలు నిన్ను నిష్ఠగతిగాఁ గారించ యత్నింతురి నీ
కకటా దిక్కెవుఁడున్నొనాకొని మఱి నీవాని కాదు, నీవంటి వా
రొక వేయైనను లెక్కలేదు సుమి రోగిష్టుల్ పండితుల్ స్నేహితుల్, ౧౬౨

ఉ॥ వారలె లేకయున్న నెడ వాండ్రును నీవును గూడి దబ్బఱల్
సారెకు వ్రాసి యెట్లయిన సాయముపట్టక పో రపత్రపున్

---

శ్వరాః, సామర్థ్యమగమున్ సర్వే కేవలంగురుసేవయా,,... శ్లో॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం, శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనతః॥... శ్లో॥ ...గురునిందాంకరోతియః, నయాతినరకాన్ ఘోరాన్ యావచ్చంద్రదివాకరౌ॥ ...శ్లో॥ "హుం" కారేణ నవక్తవ్యః ప్రాజ్ఞైశ్శిష్యైఃకదాచన. గురోరగ్రే నవక్తవ్య మసత్యంతు కదాచన, గురుం త్వం కృత్య హుం కృత్య ...నభవేద్బ్రహ్మరాక్షసః॥...శ్లో॥ ...కాలమృత్యుభయాద్వాపిగురుస్సంత్రాతిపార్వతి ... శ్లో॥ గురుదేవార్చనం యస్తుతేనదృష్టా స్త్రిసుస్తుతే॥... ...శ్లో॥ గురోః పరతరం నాఽస్తి త్రివారం కథయామితే॥ ధన్యామాతా పితా ధన్యో గోత్రంధన్యంకులంభవం, ధన్యాచవసుధాదేవి యత్రస్యాద్గురుభక్తతా, ఆకల్పజన్మకోటీనాం యజ్ఞవ్రతతపః క్రియాః, తాస్సర్వాస్సఫలా దేవి గురుసంతోషమాత్రతః,,...శ్లో॥ ఏకాక్షర ప్రదాతారం యోగురుంనైవమన్యతే, శ్వానయోనిశతంగత్వా, చండాలేష్వభిజాయతే॥ ...శ్లో॥ సప్తకోటిమహామంత్రా శ్చిత్తవిభ్రమకారకాః, ఏకఏవపరో మంత్రోగురురిత్యక్షరద్వయమ్...శ్లో॥ ... కవిత్వాదిగర్వంచుదర్పం కరోతి, గురోరంఘ్రియుగ్మే మనశ్చే న్నలగ్నం తతఃకిం తతః కిం తతఃకిం తతః కిమ్ (విస్తరస్తుతత్రైవ ద్రష్టవ్యః).

భారము మోయు ప్రజ్ఞ గలపండితులౌ కతనన్ యథార్థవి
ద్యారసికుల్ భవత్కృతుల నడ్డుద రేమియొనర్ప నేర్తువో. ౨౬౩

ఉ॥ కావున నిప్డు దేనియు వికారముఁ జేయుట్వలు మాని ప్రాజ్ఞులౌ
ధీవరులాడు పల్కులను దెల్లము గాఁ దలపోసి సత్యమున్
ద్రోవకు రమ్ము నీకు మనుద్రోహము నీ వొనరించియున్ బుజా
ఖావిలసిల్లు హేతువున కిప్పుడె? మంచియశమ్ము గల్గెడిన్. ౨౬౪

క॥ మనువచనమ్ములువిని తగ, మను మనువచనములనంగ మనువచనము లే
మనుకొంటివో? మనుమార్గమ్ము నుమాన మ్మిడిగి పట్టు మది యఘు మడంచున్

మ॥ *త్రివిధేయుండు త్రిలోకజేత యనుచున్ "త్రిష్వప్రమాద్యన్" మను
ప్రవచస్సారము తెల్పు నీవు కడగా వర్తిల్లుచున్నట్టి యా
పావనీయాగ్నిని గాలఁద్రొక్కియునవత్పాపి మూఁడు లోకమ్ము లా
పావరంగమ్మున గెల్చుటన్ వృథయ ధర్మాధర్మ దుర్మర్మముల్. ౨౬౬

శా॥§ ఆజన్మంబు గురున్ భజించునెడ బ్రహ్మప్రాప్తికర్హుండు గా
రాజించున్ స్మృతివాక్యముల్, మృషయ గుమ్మౌ శత్రియమ్మౌట నీ
కీజన్మమ్మునఁ గొంత సేవయును "హీహీహీ"లు "హూహూహూ"లు త
ద్రాజద్బ్రహ్మ సమాజమాన్యతకుఁ బాత్రత్వమ్ముఁ జేకూర్చుటన్ ౨౬౭

---

*శ్లో॥ త ఏవ హి త్రయో లోకాస్త ఏవ త్రయ ఆశ్రమాః, త ఏవ హి త్రయో వేదాస్త ఏవోక్తాస్త్రయోఽగ్నయః,, ౨౩౦,, పితా వై గార్హపత్యోఽగ్నిర్మాతాగ్నిర్దక్షిణస్స్మృతః (గురురాహవనీయస్తు) సాగ్నిత్రేతా గరీయసీ. ౨౩౧,, త్రిష్వప్రమాద్యన్నేతేషు త్రీన్ లోకాన్ విజయేద్గృహీ॥,, ౨౩౨,, (మనుస్మృతి ద్వితీయాధ్యాయము చూ)

(అభియుక్తోక్తి)

శ్లో॥ లజ్జాం మానం పరిత్యజ్య త్రిలోకీవిజయీ భవేత్॥

---

§శ్లో॥ ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యా తు మధ్యమం, గురుశుశ్రూషయా త్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే॥ ౨౩౩ శ్లో॥ ఆసమాప్తేశ్శరీరస్య యస్తు శుశ్రూషతే గురుం, సగచ్ఛత్యంజసా విప్రో బ్రహ్మణస్సద్మ శాశ్వతం॥ ౨౪౧॥ (మనుస్మృతి ద్వితీయాధ్యాయము చూ)

మ॥ *తనయార్జించిన క్షేత్ర ముఖ్య ధనముల్ దాతవ్యముల్ ముందు గాఁ
దనయాచార్యున కంచుఁ జెప్పె స్మృతి, తద్ధర్మంబు గన్పట్టె నో
తనయా! నీయెడ, నెట్టులన్న? విను దుర్ధర్మంబు త్వద్వృత్తమా
త్తనయా! నాయెడఁ దొల్తనీవు విని యుక్తంబౌట సూచించుటన్. ౨౬౮

శా॥ ¶భ్రాత్రిస్వార్జిత విత్త మందు నొక షష్ఠం బంశమున్ గైకొనం
బాత్రుండంటివి గురుండు వింటివె? భవత్ప్రజ్ఞారితాచార్యుడు
శ్శ్రుతుతాపఘ్ని ధనంబు సర్వమును సన్మత్పాత్రకృతం బయ్యె నే
మాత్రంబో యిడ కంతయున్ బెరిమ నిమ్మాడిన్ గురున్ జేర్తురే. ౨౬౯

మ॥ ‡శ్రుతిదూరంబయినన్ స్మృతిన్ దవిలె నెచ్చో నీస్థితుల్'' నిత్యము
ద్ధృత పాణిత్వము చెప్పెఁగా! మనువు, నీధీమత్తచే దాని నా
దృతమున్ జేసితి వగ్ర మం దగపడన్ దేలుం జుమీ నీదును
ద్ధృత పాణిత్వఫలమ్ము, స్మార్తమతవర్తీ! నీకగున్ భద్రముల్. ౨౭౦

క॥ †భారతవచనమ్ముల మదిఁ, జేరత మని బావనడుగు శ్రీరతులున్ స
ద్ధీరతులు నీదుపద్ధతి, ఘోరతరం బనెడిరీతి గొనకు మిఁకైనన్. ౨౭౧

---

*శ్లో॥ స్నాస్యంస్తు గురుణాజ్ఞప్త శ్శక్త్యా గుర్వర్థమాహరేత్, క్షేత్రం హిరణ్యం గామశ్వం ఛత్రోపానహమాసనం, ధాన్యం శాకంచ వాసాంసి, గురవే ప్రీతి మావహేత్॥ ౨౪౬ అత్ర వ్యాఖ్యా॥ స్నాస్యన్సన్గురుణాదత్తాజ్ఞో యథాశక్తి ధనినం యాచిత్వాఽపి ప్రతి గ్రహాదినాఽపి గురవేఽర్థ మాహృత్యాఽవశ్యం దద్యాత్॥ (మనుస్మృతి ద్వితీయాధ్యాయము.)

¶శ్లో॥ షడ్భాగం స్వార్జితం విత్తం కృత్వాఽనందాత్మకోనరః। ఏకంతు గురవేదద్యాత్....

‡శ్లో॥ నిత్య ముద్ధృత పాణిస్స్యా త్సాధ్వాచారస్సుసంయతః, ఆన్యతామితి చోక్తస్సన్నా సీతాభిముఖంగురోః॥ ౧౮౩ (మను- ౨, అ.

(భారతాదిపర్వమునుండి)

†కశ్చిదృషి ర్ధౌమ్యోనామ...తస్య శిష్యాస్త్రయో బభూవు రుపమన్యు రారుణిర్వేదశ్చేతి, సఏకంశిష్యమారుణింపాంచాల్యం ప్రేషయామాస "గచ్ఛ కేదారఖండం బధానేతి,...యస్మాచ్చ త్వయా మద్వచనమనుష్ఠితం, తస్మాచ్ఛ్రేయోఽవాప్స్యసి,

క॥ గురుశరవహ్నికిఁ గృష్ణుం, డఱిముఱి ధీతివడు ధర్మజాదుల సత్య
స్థిరుల ససత్యంపుమహా, దురితమ్మునఁ ద్రోచె నెఱుఁగుదో యెఱుఁగవో.
క॥ నిజమైనతిట్లు తిట్టుము, గజగజ నీకేలగి లేని కార్లనకుము భూ
పతిజలు సహింపరు లోలో, శ్రీ స్వజనంబేనియును దప్ప సైఁపదెఱుఁగుమీ.

---

సర్వే ఏవ తే వేదాః ప్రతిభాస్యంతి సర్వాణి చ ధర్మశాస్త్రాణీతి,... తంచోపాధ్యా యః ప్రేషయమాన'' ఉవాచోపమన్యో గా రక్షస్వేతి,... మయ్యనివేద్య భైక్ష్యం నోపయోక్తవ్యమితి... భో ఉపమన్యో క్వాఽసివత్సైహీతి. స ఉపాధ్యాయవచనం శ్రుత్వా ప్రత్యువాచ,... కూపేపతితోఽ హమితి, తము పాధ్యాయః ప్రత్యువాచ కథం త్వ మస్మిన్ కూపే పతిత ఇతి, సఉపాధ్యాయం ప్రత్యువాచ. అర్కపత్రాణి భక్షిత్వాఽంధో భూతోఽ స్మ్యతః కూపే పతిత ఇతి, తముపాధ్యాయః ప్రత్యువాచ అశ్వినౌ స్తుహి,... తౌ త్వాం చక్షుష్మంతం కర్తారా వితి,... అశ్వినౌ స్తోతుము పచక్రమే,... అశ్వినావాజగ్మతురాహతుశ్చైనం, ప్రీతౌ స్వ ఏష తేఽ పూపోఽశా నైనమితి,... నత్వహామే తమపూపముపయోక్తు ముత్సహే గురవేఽ నివేద్యేతి,... తమశ్వినావాహతుః, ప్రీతౌ స్వస్తవానయా గురుభక్త్యా,... చక్షుష్మాం శ్చభవిష్యసి శ్రేయశ్చావాప్స్యసీతి,... లబ్ధచక్షుః... ఉపాధ్యాయ మభ్యవాదయత్,... ఏషాత స్యాఽపిపరీక్షోపమన్యోః, అథాపరశ్శిష్యః... వేదోనామ... గౌరవనిత్యం గురుకులే దుఃఖాని సోఢ్వా... తస్య మహతా కాలేన గురుః పరితోషంజగామ. తత్పరితోషా చ్ఛ్రేయ స్సర్వజ్ఞతాంచావాప, ఏషాతస్యాఽపి పరీక్షా వేదస్య. ......

(విస్తరస్తుతత్రైవద్రష్టవ్యః)

రాజమండ్రి.
ది 28-8-18.

శ్రీ...తమరు కాకరపర్రు వెళ్లినప్పుడు "లోకములోని కవులందరు నా జంధ్యము లోనివారు" అని అన్నందుచే యీ అల్లరి జరిగినదనిన్ని పిమ్మట తప్పంతయును కాకరపర్తివారిదే అనిన్ని శ్రీ ఆ॥ వ్యాసలింగశాస్త్రులవారు నాతో చెప్పినారు. యింకా కొన్నిసంగతు లున్నవి కాని విస్తరించుటకు స్థలములేక వ్రాయలేదు, ...రామకృష్ణులు ముందు భాగతము ప్రచురించెదరట. వారు యెన్నివ్రాసినను గురుద్రోహమును బలపరచేవే అని శ్రీ, ఆ॥ వ్యాసలింగశాస్త్రిగారు అన్నారు...
చె. కొండయ్యవ్రాలు.

క॥ చదువెఱుఁగఁడనియుఁ గంతము, మృదువైనది గాదటనియు నేరికి విద్వే
ట్గుదిరి వచింపఁడనియు నా?, వదరి జగము మెచ్చుగోరు పద్ధతిచెపుమా.

క॥ నాయొద్దఁ జదివినదెయని, కోయిల నీవాయసంబు గూయుట తప్పా
నేని యరయుమయ్య భావము, వ్రాయన్ వలె, నీకుఁ జేయరాదిటు వ్రాయన్.

క॥ ఇరువురచేవ్రా ళ్లుండుట, యరసియు నీ కిట్లువ్రాయు టది రాదనియే
పొరఁబడితిఁ గొంతకాలము, వరమాప్తుఁడు రామమూర్తి వలికెడిదనుకన్.

చ॥ తతమతి నీ కతండు పెదతల్లికుమారుఁడు నాకు మిత్రుఁడు
న్నతుఁ డనృతం బతండు జననంబును బొందిన వంగదస్త్రా యా
కృతయుగ మాదిగా నెఱుఁగ దిప్పుడు నీకయి నేర్వఁ బోదు సూ
నృతవచనుండు నీకతన నే విని నాకు వచించె నర్భకా. ౨౭౭

చ॥ కుతుకముతో నొకానొకటఁ "గోకిల కాకము" నాకవిత్వ మం
చతనికిఁ జెప్పినాఁడవఁట? యయ్యది జ్ఞప్తికిఁ దెచ్చికొమ్ము శ
త్రుతకలిమిన్ వచింపఁడు బుధుం డతఁడేదా ప్రసంగమందు సం
గతముగుటన్ వచించె నడుగం దగునందియ ముందెనేనియున్ ౨౭౮

చ॥ అనయుఁడవై వృథాగ నెపు దాఁటిద్రాఁతలు వ్రాయుచున్ నిజం
బు నడఁచి నేఁటికేనియు సుబుద్ధివి కాక తరాక్రమించు ని
న్నును సుజనుల్ బొనర్చుట కనుంగుఁజెలిన్ ఘనురామమూర్తిగా
రిని నొక సాక్షిఁ జేసితి నెఱింగి యతండు క్షమింప మందునే. ౨౭౯

ఉ॥ అందఱు నాకు బందుగులె యంచు లిఖించెద వింతసాహసం
బెందుకు? దూరగుల్ బలెనె యింజర కాఁకరపట్టు వాసులున్
బొందఁబడంగలారె యిటు బొంకఁగ నేటికి? రామమూర్తి నే
మందువొ చెప్పుమా యకట? యాతఁడు నాపెదతల్లి పుత్రుఁడే. ౨౮౦

శా॥ చాటీలన్ వచియించువాఁడొ? జడుఁడో చండాలపుంబుంత లే
నాఁడున్ ద్రాక్కినవాఁడొ? తొక్కఁగలఁడో? నాబోఁటి లెక్కిమి యే
ప్రోడల్ నైర్తిని బెట్టుకోఁదగిన నత్పుణ్యుండు గణ్యుండు తా
నాడంబోయెనొకో? యసత్యము కుమారా? నిన్ను వంచింపఁగన్ ౨౮౧

శా॥ ఆడుంబోఁ? యనృతంబు నీకొఱకు వ్యాసాకొండి యొప్పేని, పా(ప)
ద్వాదంగాక మహోకర్కిచోఁ బొడమి కాపూకొండిచేఁ బ్రల్లదం
బాడింపంగలదేమి చూచెదనుగా కంచుఁ బరీక్షార్థమై
నేఁ డిచ్చో నుకసాక్షిగా నతని వర్ణింపన్ బ్రశంసించెఁ జూ. ౨౮౨

చ॥ ఘనుఁడల రామమూర్తి యెటుగా లిఖియించిన నెందుఁజేరునో ?
తనలిపి యంచుఁ గొంకుఁజామి తథ్యమెఱింగియుఁ, బెద్దతల్లికిం
దనయుఁడె వేఱొ కండిపుడు దా ధవళాద్రి వసించు నాతఁడున్
ఘనుఁడు తదంబయు న్మిగులఁ గందురు నేఁటికి నన్నుఁ జేర్మితోన్. ౨౮౩

†క॥ కృతమీవుమఱచితివి నీ, కతనంగదె? వారు నాకుఁ గడుఁ గూర్తురు నీ
కతి శత్రుఁడు వారలకే, గతిఁ బ్రేమూన్పదుఃడొ? తెలుపఁగాఁగలవె సుతా.

క॥ గురుఁగాకము గానుడివిన, దురితపు వ్యాసమ్ము గాంచి దుఃఖింపక యె
వ్వరొ మెచ్చిరనియు వ్రాసెద, వరరే? యటువంటియోగ్యు లవనింగలరే.

‡క॥ శత్రులుమిత్రులు నైతము,పుత్రి? తలయూఁచిరనుచుఁ జూంపెఁగదా? మీ
తత్రిక యూఁచుటకర్థ ము,పాత్రవ్యాస మనిచేయుటని గాదుగదా? ౨౮౬

క॥ నీకవితాప్రాశస్త్య, శ్రీకతనన్ గలుగు యశము చెందెడి ననునీ
కో? కృతముమఱచు పాతక,ము కడతున్ మిగులు పారమిదియె కుమారా

క॥ ఎందుకుఁ జెంచెద వఘమిది,యందఱకు న్నిజము దెలిసె నాఁగునె కస్తూ
రిందాఁచినఁబరిమళమది,బొందఁబడకు నిజమునుడివి పొందుము శుభముల్.

## (10) మంగళపద్యము.

చ॥ తిరుపతి? నాకు నింతటి విధేయుఁడు శిష్యుఁడు గల్గె వాని సం
చరణము లీశ్వరున్ దెగడు సాహసమూనెడి, వట్టివానికిన్

---

ధవళేశ్వరము. 26-8-13.

†...శ్రీ మానాన్నగారు శ్రీ మాయమ్మగారు, సదా మీ శ్రేయోభివృద్ధిని గోరుచున్నవారలు. శా॥ నారాయణమూర్తి.

(కవితనుండి.)

‡కోకిలకాకము, ఇదికోకిలమును గాకమునుగూర్చిన యొక చిత్రకథ, శత్రులుమిత్రులుగూడఁ దలయూఁచిన పద్యములు.

గురుపద నెంతయొ? తాద్భకుని గొండొక యోగ్యునిఁ జేయ వేంకటే
శ్వరుఁ డొనరించె ధర్మపుఁ బ్రసంగ మెసంగు ప్రసంగసంగతిన్ ౨౮౯
చ॥ తిరుపతి వేంకటేశ్వరుని దిట్టి దినంతులు గొట్టు వానికిం
దిరుపతి? వేంకటేశ్వరుని దిట్టి దినంతులు గొట్టుటెంత? యే
మఱఁ జన దైననున్ మనకు మంచికిఁ బ్రతిప్రసంగ మందిరా
జరుపుట యొప్ప వాని కిది సాయముఁ జేసినఁ జేయకుండినన్ ౨౯౦
చ॥ హితము వచింపఁ డాపొనఁగు నెవ్వఁడు వాఁడెపుఁడున్ వినండ భా
రతమున నేమి తక్కిన పురాణములందున నేమి యెవ్వఁడే
హితము గ్రహించె? నట్లని మనెవ్వఁడు చెప్పుటమానె? చెప్ప నే
చతురునికోయగున్ గణన నల్ప కృతార్థుఁడు వేయొకండగున్ ౨౯౧
ఉ॥ కావున నేరొనర్చినను గష్టము లోకముకో నమే యశ
శ్శ్రీవిమలీకృతోజ్జ్వలదశేష విశేషదిగంతరాళ లా
ధీశ్వరులెల్ల లోకమునఁ దేలవలెన్ బరిశుద్ధలోకనం
భావితులే సుమీ జగతి భవ్యులు సేవ్యులు కావ్యభావ్యులున్. ౨౯౨
ఉ॥ లోకము మెచ్చు గాంచు నతిలోకుని యాదవపట్టభద్రు దు
ష్పాకుఁడు దుర్జయుండు శిశుపాలుఁడు పట్టుకతిట్టె దానిచే
నాకతివేల్పుపూజనము లడ్డెనె? పాక్షికలోక మెన్నఁడున్
లోకములోనఁ జేర దరిలోకపు శోకము కీర్తికే యగున్. ౨౯౩
సీ॥ ఖరముఖాసురకోటి కపాకపారభ్భటిలేక రామకీర్తికి నట్టిరాణ యెట్లు?
శిశుపాలదుర్విపాత్ప్రళుపవ్రశలు లేక కృష్ణకీర్తికి నట్టికెలన మెట్లు?
కనకకశిపుదుష్టకష్టచేష్టలులేక నరసింహుకీర్తి కాగరిమ యెట్లు?
ఖలనృపాలకపాలాపాలకావాశావళి లేక కల్కికీర్తికి నట్టి కలిమి యెట్లు?
తే॥గీ॥ ఎంతవాఁడేని విమతులొక్కింత సాయ। మాదరింపక పేరెక్కఁడట్టులగుట
నిరతనత్కీర్తిదాతల నిర్గుణస్వరూపుల నుతించి కీర్తిఁ బ్రేరేపవలయు.
మ॥ నుతియింతున్ మన రామకృష్ణకవులన్ సున్నార్యధర్మైక స
ద్గతులన్ సూనృతవాగరాతుల, వృథావాదంభానుఘోషానృత
బ్రతులన్ దాదృశకొత్రపుంగవుల, నశ్లీలాపవాదప్రద
ప్రతిభామాతల వారివీరిహితులన్ బ్రాంచద్యశోదాతలన్. ౨౯౪

మ॥ దయనై కొల్చుటకన్నఁ దిట్టుటయ మేల్ దైవాదులన్, బూర్వమే
జయుఁడున్ శ్రీ విజయుండు శాపహతులై శాసించి రితోఁత్రిత, త
ద్దయు సౌకర్యము దీనియం దగఁబడున్ దైన్యంబు గన్పట్ట దా
శ్రయణక్లేశము నున్న తుల్యము ఫలైశ్వర్యంబు రాజించినన్.

మ॥ కలికిన్ మంగళమస్తు దానికి సిరిన్ గల్పింప యత్నించు ధీ
రులకున్ మంగళమస్తు నిస్తులవచోరూఢిన్ గలిన్ ద్రుంచు నా
ర్యులకున్ మంగళమస్తు వేదమత శాస్త్రోక్తార్యధర్మైకవ
ర్తులకున్ మంగళమస్తు గీరతవచోదుగ్ధాబ్ధికిన్ మంగళమ్

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర విరచితంబగు
గీరతాఖ్యాయమ్మునందు గురుదక్షిణ
యను ద్వితీయభాగము,
సంపూర్ణము.



